# ఉత్తరాలు

## క్రికెట్

ఈవారము (20—11—64) క్రికెట్కై యొక ప్రత్యేక వ్యాసమును మీరు ప్రచురించి నందుకు చాల సంతోషము. ఇటీవల మీరు క్రికెట్పై చూపుతున్న అభిమానానికి మేము కృతజ్ఞులము.

"ఆంధ్రప్రదేశ్ క్రికెట్ యోధులు" వ్యాస రచయిత శ్రీ కె. వి. గోపాలరత్నంగారు శ్రీ 'విజీ' ని గురించి వ్రాస్తూ, "తన ప్రారంభకులు (ప్రస్తుతం సర్) జాక్హాబ్స్" అని వ్రాసారు. అసలు సర్ జాక్హాబ్స్ మరణించి ఏడాది గావస్తున్నది! జయసింహాను పొగడ్తూ రచయితగారు మోతాదు మించిపోయారేమోననిపిస్తుంది. శ్రీ జయసింహా మంచి ఆటగాడే. ఎవరు కాదనరు. కాని ఇటీవల మన దేశాని కొచ్చిన కేవలము "రెండవ రకము" ఇంగ్లాండు జట్టుపై ఆడినంత మాత్రమున వారి భారతదేశము పేరిట "పరువు"గాను, "ట్రావర్ బెయిలీ", "ముష్తాక్ మహమ్మద్" వంటి ఆటగాళ్ళతో పోల్చటం అనుచితము. అసలు విషయ మేమిటంటే ప్రఖ్యాత జట్లపై జయసింహా ప్రతిభ ముందు ముందు ఎంతైనా చూడవలసి యున్నది. జయసింహా "బెయిలీ" వలె బాటింగ్ బవులింగ్ ప్రారంభించగలడన్నారు రచయిత. జయసింహా ఇటీవల "వెస్టు ఇండీస్" లో ఏవిధంగ 'ఫూర్తి విఫల'మైనది, ఆ మాటకొస్తే ఆస్ట్రేలియా జట్టుపై మొన్న మద్రాసులో జరిగిన 'టెస్టు'లో గానిండి, తదితర టెస్టులందుగానిండి, పేర్కొన దగినవిగా యున్నాయంటారా? అసలు ప్రఖ్యాత క్రీడాకారుడైన ఆర్. ఎస్. మోడి ఇటీవల ఒక ప్రముఖ దిన పత్రికలో రాస్తూ తన జాబితాలో జయసింహాను చేర్చనేలేదంటే పాఠకులకు వేదుగా రుస్తుందేమో? మనం మనం కించపరచుకోవటం కాదుకానిండి, ఏకంగా మనవాళ్ళు "సూర్యులు చంద్రుడు" అనటం బాగులేదు.

ఒక సంగతి. శ్రీ 'విజీ' సేవలను రచయితగారు బ్రహ్మాండముగ సుగడించారు! బాగానే ఉంది. కాని ఎంతసేపు 'విజీ' "యు. పి." క్రికెట్టుకుగానిండి, దాని ప్రెసిడెంట్గా కానిండి, లేక అఖిల భారత క్రికెట్ కంట్రోలు బోర్డు ప్రెసిడెంట్గా కానిండి, సేవ చేసారేకాని, తనవారైన తన ప్రాంతమైన, చేయూత కొరకు తపిస్తున్న ఆంధ్ర సంస్థకు 'విజీ' ఎటువంటి సేవ చేసారో శ్రీ రచయితగారే తెల్పాలి!!—రచయితగారిపై నా కెటువంటి దురభిమానములేదు. పైపెచ్చు వారి రచనలో యొక ప్రత్యేకత ఉందని నా యభిప్రాయము—ముఖ్యంగ "సి. కె." ని, "గులాం మహమ్మద్"ని వ్రాయడములో.

ఇంకొక విషయము. గత పది సంవత్సరములుగ ఇతర రాష్ట్రాల జట్లపై మన ఆట చెప్పుకో దగ్గ (గెలవటంమాట అటుంచండి) విధంగాలేదు. ఏది ఏమైన ఇప్పటి పరిస్థితులబట్టి ఆంధ్రలో క్రికెట్ చాల వెనుకబడియున్నది. మనలో ప్రతిభగల యువకులు లేకగాదు. మరి క్రికెట్ మనకు క్రొత్త అంతకన్నాగాదు! మనకు 'కోచింగ్' 'సెంటర్సు' "క్లబ్బులు" తదితరములు చాల తక్కువ. కేవలము వ్యక్తుల స్వశక్తితో ఆటలో ప్రావీణ్యం సంపాదించటము దుస్సాధ్యము. అసలు ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే, కొంతకాలము క్రిందటివరకు మన జట్టుకు 'వెన్నముక' అన దగిన "ఒక ప్రఖ్యాత" ఆటగాడు యుత్తరానికి పోయి "యు. పి." జట్టుకు వేడు "మధ్య మండలము" జట్టుకు ఆడవలసిన అగత్య మేముందంటారు? ఇక్కడ 'ఛాన్సు' తక్కువేగా? ఏమంటారు! ఇంకా పెక్కు ప్రాంతాలలో, పాఠశాలలలోను, కాలేజీలలోను శ్రద్ధ అంతంత మాత్రముగానే యున్నది. పోతే, అధికారుల ముందున్న సాధక బాధకాలను నేను విస్మరించటములేదు. నిజమే ఆర్థికమైన ఇబ్బందులున్నాయి! కాని ఒక్క మాట, కొన్ని నెలల క్రితం మాత్రమే నిర్మింపబడ్డ అనంతపూరులోని స్టేడియం తప్పక మనకు చెప్పుకో దగ్గ "స్టేడియం" లేమున్నాయండి? ఏదీ మచ్చుకు చూపించండి. మనకు పెద్ద పెద్ద "మ్యాచెస్" ఏర్పాటు చేసేందుకు, ప్రేక్షకులు చూసేందుకు, ఆటలో యుత్సాహము పెంపొందించేందుకు, ఆర్థిక లోపాలు తీరేందుకు ఆస్కారములేదంటే ఆశ్చర్యపడ నవసరములేదు. ఇక అభిమానుల విషయమంటారా? ఆంధ్రలో ఉన్నంత క్రికెట్ క్రీడాభిమానులు 'మద్రాసు' రాష్ట్రములో కూడ లేరంటే అతిశయోక్తి కాదేమో!

పత్రికల ప్రోత్సాహము, అభిమానుల ఉదారత ఆంధ్రలో క్రికెట్ వృద్ధి చెందాలంటే ఎంతైనా అవసరమని, పాఠకులలో చాలమంది నాతో ఏకీభవిస్తారని ఆశిస్తున్నాను.

రాజేంద్రప్రసాద్ (సూళ్లూరుపేట) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 25-12-'64
క్రోధినామ సం॥ మార్గశిర మాస బ॥ నవమి
సంపుటము 57 సంచిక : 17
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలకు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడి ప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"స్వతంత్రపార్టీ అయితేనేం, 5 వేల విరాళం ఇవ్వకపోతే మా పనేమి కాను?"

## మనలో మాట

**పాఠకులందరికీ క్రిస్మస్ శుభాభినందనలు!**

* * *

'సంపెంగలూ-సన్నజాజులూ' రచయిత పేరు పాఠకులకి సుపరిచితమే! శ్రీ అవసరాల రామకృష్ణారావుగారు ప్రస్తుతం కళాశాలలో ఉపాధ్యాయ వృత్తి అవలంబిస్తున్నారు...

* * *

చలికాలం కనుక ఉన్నితో అల్లే స్వెటర్‌కి సంబంధించిన వ్యాసం ఒకటి ఈ సంచికలో వేస్తున్నాము. కొంతకాలం ముందు నిటింగ్ 'పాఠాలు' కొన్ని చిత్రాలతో సహా ప్రచురించాము. నిటింగ్ నేర్చుకుంటున్న వారికోసం ఇటువంటి పాఠాలు కొన్ని తిరిగీ ప్రచురిస్తాము...

* * *

1964కి ఇది చివరి సంచిక. పై శుక్రవారం సరిగ్గా జనవరి 1వ తేదీన వస్తుంది!

* * *

ఈ సంవత్సరంలో చరిత్రాత్మకమయిన సంఘటనలు చాలా జరిగాయి. ఈ సంచిక తయారవుతున్న సమయానికి, ఇంకా జరుగుతున్నాయి కూడా! వీటిని సమీక్షిస్తూ 1-1-1965 సంచికలో ఒక వ్యాసం ప్రచురించాలని అనుకుంటున్నాము...

* * *

ఎప్పటిలాగే సంక్రాంతి సందర్భంలో ఆంధ్ర సచిత్ర వార పత్రిక ప్రత్యేక సంచిక ఒకటి వెలువరిద్దామనుకుంటున్నాము. ఈ ప్రత్యేక సంచికకి సంబంధించిన ప్రకటన ఈ సంచిక 4వ పేజీలో చూడవచ్చు...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'సుమంగళి'లో సావిత్రి.


కథలు :

కల్పన — 12
జైలు — 24
అతడి నిజాయితీ — 34

సీరియల్ కథలు :

అంగారు వదలిన కాంతి — 10
సంపెంగలూ - సన్నజాజులూ — 28
(కొత్త సీరియల్ ప్రారంభం)
అయిదురెళ్లు — 40

శీర్షికలు : వ్యాసాలు : సినిమా.

ఉత్తరాలు — 4, ఊమెన్ కార్టూన్ — 6, చికిత్సం అవధులు — 7, పసి కాంచన పతి కయం—8, వనితాలోకం—17, వారఫలం—19, సినిమా శిల్పా—51, సినిమా వార్తలు—55


నెట్టుకెండోయ్!
ముందు
గోతులున్నాయ్
హిందీ వాదులు
హిందీ అభివృద్ధి


అధికార వర్గాల అలసత్వం వల్లనే ఓడల్లోని గోధుమలు అలానే వున్నాయి.
ఈ అలసత్వాన్ని తగ్గించలేరా?
ఆహార మంత్రి
ప్రజలు




లోపలికే పదండి
ఐకమత్యకు కృషి
కమ్యూనిస్టుల కుడిపక్షం
ముందు మీరే పదండి
కమ్యూనిస్టుల వామపక్షం

# డేవిడ్ ఏట్రిక్
# చికిత్సల అవధులు - 5

## కొరైజా

జలుబునే 'కొరైజా' అంటారు!

లెక్కలువేసి చూడగా, నూటికి 99 మందికి సంవత్సరానికి 2 నుంచి 7 సార్లదాకా జలుబు చేస్తూనే ఉంటుందని తెలిసిందిట!

కొరైజా 'చిన్న జబ్బు' అనుకోవచ్చుకాని దీని వల్ల ప్రపంచానికి ఎంతో నష్టం కలుగుతుం డటంతో సందేహంలేదు.

ఎస్కిమోలకి, కొన్ని పసిఫిక్ ద్వీపాలవారికి అంత తొందరగా జలుబు చెయ్యదుటగాని బయట దేశాల వాళ్లు అక్కడ వాళ్ళకి వచ్చినప్పుడు మాత్రం ఊళ్లో కొరైజాకి కొదువ ఉండదు!

జలుబు రాకుండా చూడటం ఎలా?

వస్తే కుదర్చటం ఎలా?

ఈ రెండు ప్రశ్నల సమాధానాలకి వైద్య పరిశోధకులు నిర్విరామంగా కృషి చేస్తున్నారు. నిర్విరామంగా అంటే నిజంగానే ఏకాగ్రతతో, తక్కిన పెద్ద రోగాల విషయంలో చూపినంత శ్రద్ధతో, పరిశోధనలు జరుపుతున్నారన్నమాట.

జలుబు ప్రాణం తీయకపోయినా తీసినంత పని చేస్తుంది. దీనిని జయించగలిగితే వైద్య శాస్త్రం నిజంగా ప్రశంసనీయమయిన దవుతుంది.

కేవలం జలుబుమీదనే పరిశోధన జరిపేకేంద్రం ప్రపంచంలో ఒకటే ఉంది— ఇంగ్లండులో (శాలిస్బరీలో) హార్వర్డ్ హాస్పిటల్. అయితే ఈ కేంద్రంలోని పరిశోధనల ఫలితాలని ప్రపంచంలో తక్కిన వైద్యశాస్త్రవేత్తలందరూ జాగ్రత్తగా అనుశీలిస్తారు.

హార్వర్డ్ ఆస్పత్రిలో 'జలుబు పరిశోధన' ప్రారంభించి 14 సంవత్సరాలు అయింది. ఇంత దాకా 8,000 మంది 'వాలంటీర్లు' ఇక్కడ వివిధ పరిశోధనలకి లోనయ్యారు. జలుబు ఎలా పడుతుంది, ఈ రోగక్రిములు ఎలా పని చేస్తాయి, అవి ఎన్ని రకాలు— మొదలయిన ప్రశ్నలకి సమాధానాలకోసం ఇక్కడ నిర్విరామ కృషి జరుగుతోంది.

జలుబు గురించి ఎన్నో విషయాలు తెలిశాయి. కాని, చికిత్స, నివారణ ఇంకా చాలా దూరంగానే ఉన్నాయి...

## జలుబు ఎందుకు పడుతుంది?

జలుబుకి కారణం కొన్ని చిమ్ముల 'వైరస్' (Virus)లు. ఇవి ఎన్ని రకాలో ఇంకా సరిగ్గా తెలీదు.

**ఒక్కొక్క రకం వైరస్ ఒక్కొక్క రకం జలుబుకి కారణమా?**

'కాదు' అని తోస్తుంది. ఒకేరకం వైరస్ వివిధ 'వాలంటీర'్లకి ఇవ్వగా ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం జలుబు చేసిందిట! ఒకరికి ముక్కులోబాధ, ఒకరికి జ్వరం, మరొకరికి రొమ్ములో పడిసెం పట్టెరా......

## జలుబు ఎలా చేస్తుంది?

ఇది అంటువ్యాధి.

''తడిసినంతమాత్రాన, వానలో తిరిగినంత మాత్రాన జలుబు చెయ్యదు.'' అంటాడు డా. డేవిడ్ టయిరెల్, హార్వర్డ్ హాస్పిటల్ అధిపతి. ''ఒకరిమించి మరొకరికి అంటుకోవాలిసిందే!''

కొందరికి జలుబు క్రిముల శక్తిని ఎదుర్కొనే దేహస్థితి ఉంటుంది. ఇటువంటివారికి 'వైరస్' ఎక్కించినా జలుబు రాకపోవచ్చు.

## దీనికి కారణం ఏమిటి?

డా. టయిరెల్ జవాబు: ''కొందరికి రక్తంలో 'వైరస్'ని జయించే పదార్థాలు ఉంటాయి. కాని, ఒకరకం వైరస్‌ని జయించినంతమాత్రాన తక్కిన రకాల వైరస్‌లని జయించలేకపోవచ్చు.''

నూటికి ఒకరికి కారణం ఏమీ లేకుండా కూడా జలుబు చెయ్యవచ్చుట. వైరస్‌లాగే కనిపించని, నిరపాయకరమయిన ఒక ద్రవ్యం ఇస్తే ఇటువంటివారికి జలుబు లక్షణాలు వస్తాయి......

## నేటిదాకా సాధించిన దేమిటి?

జబ్బెలా ఎలా పడుతుందో కొంత దాకా తెలిసింది.

ఏడు రకాల వైరస్‌లు ఉన్నట్లు తెలిసింది. ఇటువంటివి మొత్తం పదిహేనుమంది ముప్పయి దాకా ఉండవచ్చునని అంచనా.

''వైరస్‌లని మనమే 'పెంచ'గలగటం పెద్ద ముందడుగు,'' అంటాడు డా. టయిరెల్. ''దేహం లోనేకాక, పరిశోధనా పాత్రలలో వీటినిపెంచి, వాలంటీర్ల అవసరం లేకుండా పరిశోధనలు చెయ్యటం నిజంగా గొప్ప విషయమే! ఈ వైరస్‌లని నాశనంచేసే పదార్థాలను తయారుచేసి చూడవచ్చు కదా?''

## ఎదురు చూదతగిన అభివృద్ధి ఏమిటి?

''వైరస్‌లని నాశనంచేసే పదార్థాలు మానవ దేహంలో ఉత్పత్తి అయ్యేట్లు చూడాలి. ఒక్కొక్క రకం వైరస్ గుణాలు కనిపెట్టి వాటికి విరుగుడు కనిపెట్టాలి'' అని డా. టయిరెల్ నాకు చెప్పాడు.

## నివారణ సాధ్యమా?

''వాక్సిన్ తయారీ ఒకటి రెండు సంవత్సరాలలో సిద్ధమవుతుందేమో! ఎన్నో రకాల వాక్సిన్‌లు అవసరం కావచ్చు!'' ఇది డాక్టర్ టయిరెల్ అభిప్రాయమే.

''ఇన్ఫ్లుయంజా వైరస్ కూడా జలుబు లక్షణాలు వచ్చేట్లు చెయ్యవచ్చు. కొన్ని సమయాలలో జలుబు వైరస్‌లు ఇన్ఫ్లుయంజాలాగ పని చేస్తాయి!

''ఇంజక్షన్లతో ఎంత నివారణసాధ్యమవుతుందో కాలమే తెలుపగలదు......''

**సాధారణంగా వైరస్‌లు ఒక వాక్సిన్‌కి లొంగినా తిరిగి ఆ వాక్సిన్‌నే జయించగల శక్తిని అలవరుచుకుంటాయి కదా?**

జలుబుకి సంబంధించినంతవరకూ ఈ ప్రమాదం ఎక్కువ కాదని డా. టయిరెల్ నమ్మకం. కొన్ని వైరస్‌ల విషయంలో వాక్సిన్‌లు పని చేయనే చేస్తున్నాయికదా!

## చికిత్స అవకాశం ఎంతమాత్రం ఉంది?

వైరస్‌ను పెరగకుండా ఆపే పదార్థం ఒకటి ఉంది. ఇది చికిత్సకి పనికి వస్తుందా రాదా అనే సమస్య ఇంకా పరిష్కారం కాలేదు.

చికిత్సకన్నా నివారణ మంచిదని అందరూ అంటూనే ఉంటారు కదా!

## ఆంటీ బయాటిక్ మందులు

''ఇవి వైరస్‌లని చంపలేవు'' అంటాడు డాక్టర్ టయిరెల్. ''ఏదో కొంత గుణం ఇచ్చినా సమయానికి ఇతరంగా హాని కలిగించవచ్చు......

**''అయితే మీకు జలుబుచేస్తే ఏంచేస్తారు?'' అని అడిగాను:**

''నాకు త్వరగా జలుబు చెయ్యదు! చేసినా ఆవిరి పట్టటం, ఆస్ప్రిన్ మాత్ర వేసుకోవటం, కాపటం పెట్టటం — ఇవే నేను చేసేవి! పాత పద్ధతులే అయినా ఇంతకు మించిన మందులు నిజంగా లేవని నేను ఇస్తున్నాను!

''మీకు జలుబుచేస్తే ఇతరులకి అంటకుండా చూడటం మీ కర్తవ్యం. చిన్న పిల్లలకీ, వయసు మళ్ళిన వారికీ దూరంగా ఉండండి. వారికి ఎంతో హాని చెయ్యవచ్చు.

''చాలా అభివృద్ధి జరిగింది. ఇంకా జరుగ వచ్చును. మా ప్రయత్నాలు మానుకోము. ఎప్పుడో ఒకప్పుడు విజయం సాధిస్తాము'' ★



# నటి కాంచన పరిచయం - మోహన్ కుమార్

శ్రీధర్ "కాదలిక్క నేరమిల్లై" చిత్రం నిర్మించేప్పుడు... అందులో నటించే వారంతా కొత్తవారే కావాలనుకొన్నారు— చిత్రము చిత్రముగా అంతా ఆ చిత్రం కోసం నిర్ణయించారు. చివరకు ఎన్నిక చేసి తీసుకొన్నారు. ఆ చిత్రంలో ముఖ్య భూమిక నిర్వహించిన కాంచనను, ఆమె నటనను చూసి ముగ్ధులయ్యారు చాలా మంది. ఆమె రూపలావణ్యాలు, హావభావాలు, వాచిక ప్రయోగాలు వారిని ఆకట్టుకొన్నాయి.

కాంచన సినిమా రంగానికి మరీ కొత్త. ఈ చిత్రానికి ముందు ఆమె ఏ చిత్రంలోనూ నటించలేదు, కనీసం స్టేజిమీదైనా ఏనాడూ కెమెరా ముందు నిలబడలేదు.

[illegible] ముందు ఏ చిత్రంలోనూ నటించని ఈ కొత్తవాళ్ళలో అనుభవం ఉన్న నటిలా నటించిందంటే— నిజంగా అందరికీ ఆశ్చర్యం వేసింది. అయితే ఆ పాత్రను రక్తి కట్టించేందుకు కాంచన చేసిన కృషి ఎలాంటిదో, ఎంతటిదో— ఆలోచించిన వారికీ, ఆమెను తెలిసి ఉన్న వారికీ అర్థం అవుతుంది.

అసలు కాంచన వెండితెర మీదకు రావడమే విచిత్రంగా జరిగింది. లేకపోతే ఎయిర్‌హోస్టెస్ కాంచన సినిమాతార కాంచనగా ఎలా మారుతుంది?

* * *

లాన్స్‌డౌన్ ఇంజనీర్ శ్రీ పి. రామకృష్ణ శాస్త్రిగారి కుమార్తె కాంచన. శాస్త్రిగారి స్వస్థలం విజయవాడ అయినా, వృత్తి రీత్యా మద్రాసులో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. కాంచన మద్రాసులోనే పుట్టింది.

స్వతహాగా శాస్త్రిగారిది మంచి కట్టుబాట్లతో ఉన్న కుటుంబం. ఆ ఇంట జన్మించినందునా, మంచి పద్ధతులతో పెరగటం వలనా— హుందా, రాజసం ఆమెకు వచ్చినవి.

చిన్నతనం నుంచీ కాంచనకు సంగీతమంటే భలే మోజు. రేడియోలో వచ్చే పాటలు ఆసక్తితో వింటూ— ఆ గొంతులతో తన గొంతు కలిపి పాడుతూ, ఆనందిస్తూ ఉండేది. మరీ మంచి సంగీతం ఉన్న పాటలు వచ్చినప్పుడు కాళ్ళు కదుపుతూ వచ్చీరాని గంతులు కూడా వేస్తూ ఉండేది.

తల్లిదండ్రులు అమ్మాయి కళాతృష్ణ చూసి నాట్యంలో ప్రవేశ పెట్టారు. తొమ్మిదో ఏట నుంచీ వడయూర్ రామయ్యపిళ్ళైగారి వద్ద నృత్యాలు నేర్చుకున్నది.

హైస్కూలు విద్య ముగించి మద్రాసులో ఎతిరాజ్ కాలేజీలో చేరింది. కాలేజీలో ప్రదర్శించే అనేక నాటకాల్లో పాల్గొన్నది. అక్కడి వారిచేత మంచి నటిగా ప్రశంసలు పొందింది. కొన్ని బహుమతులు కూడ గెలుచుకున్నది. ఇంటరు పూర్తి చేసి చదువుకు స్వస్తి చెప్పింది. ఖాళీగా ఉండడం ఇష్టంలేక ఎయిర్‌లైన్స్‌కి అప్లై చేసింది. ఇంటర్వ్యూకి పిలిచారు. ఎయిర్ హోస్టెస్‌గా ఎన్నిక చేశారు అధికారులు. రెండేళ్ళు ఆ ఉద్యోగంతో ఉంది.

కాంచన హోస్టెస్‌గా ఉన్న విమానం ఆ రోజు మద్రాసు నుంచి బెంగుళూరుకు బయలుదేరుతోంది. కొన్నై వెలియన్ అనే తమిళ నిర్మాత అందులో ప్రయాణం చేస్తున్నారు. కాంచన అంద చందాలు అతనను ఆకర్షించాయి— చూస్తుండగానే ఆలోచన వచ్చింది. ఆమెను పిలిచి "సినిమాల్లో వేషం వేయడం మీకు ఇష్టమేనా?" అని అడిగారు.

"ఇష్టం ఉండగానే సరా, అవకాశమూ, అదృష్టమూ కూడా ఉండాలిగా!" అంది కాంచన.

"ముందు మీరు ఇష్టపడితే— ఆ తర్వాత వాటంతట అవే వస్తాయి. ప్రసిద్ధ దర్శకుడు శ్రీధర్ నాకు మిత్రుడు. అతను ఇద్దరు ముగ్గురు కొత్తవాళ్ళకి తన ప్రతి చిత్రంలోను అవకాశం ఇస్తున్నాడు. అతనితో చెబుతాను" అంటూ— ఆయన బెంగుళూరులో దిగిపోయాడు.

సినిమాలలో నటించి పైకి రావాలనే వాంఛ కాంచనలో చిరకాలం నుంచీ ఉన్నది. అయితే ఆ కోరిక అప్పట్లో దుస్సాధ్యమని అనుకుంది. ఆ ఆలోచనను



దర్శకుడు శ్రీధర్ శిక్షణలో...

దూరం చేసుకుంది. ఇపుడు వెలియన్‌గారి మాటల్లో— తన భవిష్యత్తులో ఏదో మార్పు రాబోతున్నట్టే తోచింది. తను కోరుకుంటున్నది కూడ అలాంటి మార్పే !— ఆ రాత్రి అంతా ఇలాంటి తలపులే కదలినవి.

కాంచన అదృష్టాన్ని వెంబడిస్తూ వెళ్లక పోయినా, అదృష్టమే ఆమెను వెతుక్కుంటూ వచ్చింది. వెలియన్‌గారితో సంభాషణల అనంతరం కొద్ది రోజులకు ఆయనా, శ్రీధర్ బొంబాయి వెళ్లే విమానం ఎక్కారు. అందులో హోస్టెస్‌గా ఉంది కాంచన. శ్రీధర్‌కు ఆమెను పరిచయం చేశారు.

చురుకైన కన్నులు, పాలబుగ్గలు, మొనదేలిన గడ్డం, సన్నని నడుము— అన్నిటినీ మించిన అందం శ్రీధర్‌ని ఆకర్షించినవి. వివరాలు అడిగి తెలుసుకుని, చిరునామా తీసుకుని తర్వాత కబురు చేస్తామని వెళ్లిపోయారు.

ఇది జరిగిన కొంత కాలానికి శ్రీధర్ (చిత్రాలయ) నుంచి పిలుపు వచ్చింది కాంచనకు. మేకప్ టెస్ట్, సౌండ్ టెస్ట్ జరిపించారు. ఫలితాలు చూసి ఎన్నిక చేశారు.

అపుడు శ్రీధర్ 'కాదలిక్క నేరమిల్లై' చిత్రం రంగుల్లో నిర్మిస్తున్నారు. అందులో ఓ ముఖ్య భూమిక ఇచ్చారు. ఎంతో ప్రోత్సాహం చూపారు. ఇచ్చిన మేరకు, తనకు వచ్చినవరకూ కాంచన ఆ చిత్రంలో చక్కగా చేసింది. ఇటు పరిశ్రమలోని పెద్దలూ, అటు ప్రేక్షకులూ కూడ మెచ్చుకున్నారు. వచ్చిన అవకాశాన్ని వినియోగించుకొని— తొలి చిత్రంతోనే అందరి మెప్పులూ పొందడం అంటే సామాన్యమైన విషయం కాదు మరి !

కాంచన ప్రస్తుతం రాజలక్ష్మి వారి ''వీరాభిమన్యు'' చిత్రంలోను, పి. పుల్లయ్యగారి దర్శకత్వంలో తయారవుతున్న పద్మశ్రీ వారి ''ప్రేమించిచూడు'' చిత్రంలోను నటిస్తోంది. ఇవికాక మూడు తమిళ చిత్రాల్లో ఉంది. ఆమెకొక చెల్లెలు ఉన్నది. పేరు శశిరేఖ. ఈమె కూడా నటి. తమిళ చిత్రాల్లో వేస్తోంది.

కాంచనలో చదువుతోపాటు, చక్కని సంస్కారమూ ఉంది. నిర్భీతి, నిస్సంకోచం ఆమె సొత్తు. అతిథి మర్యాదలు చేయడంలో ఎప్పుడూ ముందంజ వేస్తుంది. పుస్తక పఠనం అంటే అమితమైన ఇష్టం. అందులో ఇంగ్లీషు పుస్తకాలంటే మరీను ! సంగీతం వచ్చును. స్వయంగా పాటలు పాడుతుంది. ఆటా పాడటమంటే ఎంతో సరదా కూడాను.

కాలేజ్ గర్ల్, డాన్సింగ్ రోల్స్, సిల్లీగా ఉండే వేషాలను చక్కగా పోషిస్తుంది. ''ప్రేమించి చూడు'', ''వీరాభిమన్యు'' చిత్రాలు విడుదలయిన తర్వాత మీ అందరి అభిమానాలను పొంది తీరుతుందనడంలో అత్యుక్తి లేదు. ★



'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలో మంచి పేరు తెచ్చుకున్న కొత్త టాలెంట్.




# 11

"అయ్యా సుందరాంగం ! ఇదీ మా అడవిలోని పరిస్థితి ! సోదరులంతా సర్వమంగళం కోంతులో ఎం గుడు పడిపోతున్నారు. యాదార్థవ డి, లోకవిరోధి అన్యాయంగదా ! జరుగుతున్నపాపం కళ్ళతోచూచి, వోటితో చెప్పుకున్నందుకే నాకీశిక్ష !" అన్నది చిట్టికోతి.

"...వేత్య పాపం ! సోదరులకు ఎట్టి దుర్గతి వాటిల్లినది!..." అంది సుందరాంగం జాలిగా "అయినా, ఇంత అక్రమం జరగడం కూడా కద్దా ?" అంటూ అది ఆశ్చర్యాన్ని కూడా వెలిబుచ్చింది.

"ఎంత అమాయకుడవయ్యా సుందరాంగం నువ్వు! తెల్లనివన్నీ పాలేనా ?... మోసాలతో, పక్షాలతో పొట్ట నింపుకుంటున్న ప్రాణులు లోకంలో ఎందరున్నారో నీకేం తెలుసు ?"

"ఉండవచ్చు ! కాని పులిరాజా ఇటువంటి వాడంటే మాత్రం నమ్మడం కష్టంగానే ఉంది. ఇంతకు మునుపే కపారి అతడు ఇక్కడికి వచ్చాడు. రెండు గుక్కల నీరుతప్ప ఆనటించేమీ పడ్డన్నాడు. మమ్మల్ని ఆదరించాలన్నా అతనికి ఎట్లవేసింది ? అంతటి సాధువుంగవుడు ఇంతక్రూరుడెలా కాగలిగాడు ?" అన్నాడు సుందరాంగం.

ఇంతలో కొన్నిజింకలు దిగులుముఖంతో అక్కడికి పరిగెత్తుకవచ్చాయి. "ఘోరం ప్రభూ ! మహా ఘోరం!" అంటూ ఏడుస్తున్న గొంతుకలతో హాహాకారాలు చేశాయి.

ఇంతవరకూ ఇటువంటి మాటే విని ఎరుగని సుందరాంగం ఈ కేకలను విన్నవెంటనే మాట పడిపట్టు ఆదిరిపడింది. "ఏమిటి ? ఏమైంది ?" అని అడిగింది.

జింకలు ఇలా చెప్పాయి— "క్రిందలోయలో మేము పచ్చికమేస్తున్నాము పులిరాజా, అతనితోబాటు ఒక నక్క మాదగ్గరికి వచ్చారు. పులిరాజాకు మేము తలలు వంచి నమస్కరించాము. "రాజావారు చాల ఆకలితో ఉన్నారు.ఈపూట వారికి ఎవరు ఆతిథ్య మిస్తారు.?" అని అడిగింది నక్కమమ్మల్ని. "నేనిస్తాను" అన్నాడు మాలో ఒకడు, "ఇక మిగిలినవారంతా వెళ్ళండి. మీ వంతు వచ్చినప్పుడు మీరలాయిద్దురుగాని !" అంది నక్క. పులిరాజా గాండ్రుమంటూ ఎగిరి ఆజింక గొంతు కొరికేశాడు. బ్రతుకు జీవుడా అంటూ మేము పారిపోయి వచ్చేశాము."

"రామ రామ !" అంటూ చెవులుమూసుకుంది. సుందరాంగం .

కోతికొండ అంచుకు వెళ్ళింది. క్రింద అడవివైపు ఉన్నలోయలోకి చూచింది. దూరంగా పొదలనడుమ— చచ్చిపోయినజింకను ఆరగిస్తున్నదిపులి.టక్కుటమారం దానిఎంగిలి కూటికోసం కాచుకొని కూర్చుని ఉంది.

"సుందరాంగం ! ఇలావచ్చిచూడు !" అంది కోతి.

సుందరాంగం కోతివద్దకువెళ్ళి, క్రిందలోయలోకి చూచి "రామరామ" అంటూ కళ్ళు మూసుకుంది.

"సుందరాంగం ! సర్వమంగళం ఎంత సాధువో చూశావా ? అతనికి రెండుగుక్కలనీరుతప్ప మరింకేమీవద్దు కదూ ?...." అంది చిట్టి కోతి.

"వెర్రివాడా !..నేను ఓసారు అలాకిందికి వెళ్ళి వస్తాను ! మనంమళ్ళీ కలుసుకోవాలని వేయి దేవుళ్ళకు మొక్కుకో !" — అంటూకి చెంగు చెంగున లోయలోకి పరుగెత్తింది. దొంగలాగావెళ్ళి పులికినమీపంలోనున్న ఒక చెట్టుమీదకెక్కి కొమ్మల్లో కూర్చుంది.

> "అన్నమయితే నేమిరా మతి
> మన్నయితే నేమిరా?
> అందుకే ఈమనిషిబ్రతుకు
> అన్నమే వేదాంతరా !
> నెత్తురైతే నేమిరా మతి
> నీరమైతే నేమిరా ?
> అందుకే ఈ పాడుబ్రతుకు
> నెత్తురే కావాలిరా !..." అంటూ పాట అందుకొంది.

...ఈపాట విని, పులి చుట్టుప్రక్కల కలయచూస్తూ "ఎవర్రా వాడు ?" అంది.

"గురో!ఎవరో ఎందుకవుతాడు? చిట్టికోతిగాడే!' అన్నది టక్కుటమారం.

"ఏమిరా కొంటెవెధవా! నువ్వు ఇక్కడికి దాపురించావా?!..నిన్నిక్కడే కూడ్చి మసిచేసేస్తాను చూసుకో" అందిపులి చెట్టుకొమ్మ కొరకుతో.

"ఒరే సర్వమంగళంగారూ ! నీకోతలు నాదగ్గర కొయ్యకురా వాతంత్రీ!..ఏమిటి — ఇలా దండయాత్రకు బయలుదేరావు? ..దేవరవారి పొట్టవేదాంతం తం వారిరాజ్యంలో పనిచేయడం లేదా?"— అంది చిట్టికోతి.

"ఆయ్ ! హోయ్మయ్ !"

"ఆయ్అన్నా, హాయ్అన్నా నీపప్పులు మనదగ్గర ఉడకవురా నాయ్ ! ... వృథా కంఠశోష ! హోయ్మయ్!" అంటూ కోతి వెక్కిరించింది.

దాన్ని చీల్చిపారెయ్యాలన్నంత ఆగ్రహావేశంతో పులి చెట్టుపై కెగిరి , అందుకోలేక వెల్లికిలా పడిపోయింది.

"ఒరే మహాప్రభూ ! నీదేజిన యున లేపిరావాలి !" అందికోతి.

"పళ్ళురాలకొడతాను కోతివెధవా !" అంటూ లోయదద్దరిల్లేలా గాండ్రించింది పులి.

"నేనుతమరి కాళ్ళు విరగ్గొడ్తానండి రాజావారూ!"

"గూబ గుయ్యిమనిపిస్తా !"

"నేనుతమర్ని డొక్కలోతంతా !"

"కిందికిరా— నమిలేస్తా !"

"తమరు పైకిరండి ! దవ్వరించేస్తాను !"

"తన్నానంటే ఆమడదూరం వెళ్ళిపడతావు."

"ఏదీ— తన్నండి చూద్దాం !"

"నీకు ఆయువు మూడింది !"

"తమరికి చేటుగాలము దాపురించినది !"

....ఈ వాగ్యుద్ధం అరగంటసేపు కొనసాగింది. ఆఖరికి పులి ఓడిపోయింది. అది పూర్తిగా అలసిపోయి నోరుమూసుకుంది. "ఒరేదేవరా ! పాపం అలసిపోయావుగాని, కాసినిమంచినీళ్ళుత్రాగి మెదలకుండా పడుకోరా మహాప్రభూ ! ఒరేటక్కుటమారం ! ఏతిండి దొంగలెత్తుకపోరుగాని, మీ అయ్యగారికి కాస్త శైత్యోపచారాలు గావించవోయ్ ముందు..." అంది చిట్టికోతి.

తరువాత అది— "ఈనాటి రణరంగంలో చిట్టికోతి పులిగాణ్ణి చిత్తుగా ఓడించేసిందోహాయ్ ! చిట్టికోతికి—జై !" అంటూ జైభేరి మ్రోగిస్తూ, చెట్లమీదుగా దూకుతూ అక్కడినుంచి వెళ్ళిపోయింది

ఆకలివేసినప్పుడల్లా పులి ఒక్కొక్కజింకను చంపసాగింది. అది తినగా మిగిలిన ఆహారంతో టక్కుటమారం బ్రతుకు రోజూ ఒకపండువులా ఉంది.

సర్వమంగళం క్రమంగా తనవేదాంతానికి తిలోదకాలు వదులుకుంటున్నది. నివురుగప్పిన నిప్పులా ఉండినదాని స్వభావం కార్చిచ్చులా విజృంభించింది. తననిజరూపం ఇంక బంగారుకు తెలియక తప్పదు. తెలిస్తే మాత్రమేం ?..తానిరువురూ పాటించదగిన పంచసూత్రాలను తాను నిరాదరించినట్లు దాఖలాలేవి ?...తాను అతని స్వేచ్ఛకు భంగం కలిగించలేదు. అతని వస్తువులు అపహరించడమంటూ ఇంకా జరుగలేదు. అతనివ్యక్తిగత విషయాలలో జోక్యం కల్పించుకోలేదు. ఇక— న్యాయమా ? తిండి లేకపోతే బ్రతుకులేదు. కనుక— తిండి సంపాదించుకోవడం న్యాయం కాకపోదు. ఇన్నిఅనుకూలాలదృష్ట్యా— బంగారుతో తనకు ఏపేచీలేదు.

ఒకనాడు సర్వమంగళం— సుందరాంగం సమక్షంలోనే ఒక జింకను చంపబోయింది. "పులిరాజా ! ఇలా జీవహింస చేయడం అన్యాయం

కాదా ! పాపం కాదా !'' అని అడిగింది సుందరాంగం ధైర్యంచేసి.

''మిత్రమా ! న్యాయం అందరికీ ఒకటే ! నీకు ఆకలివేస్తే నువ్వేం చేస్తావు ?.... గడ్డి తింటావు గదా ?.... నాకు ఆకలైనప్పుడు నేనూ ఏదో ఒక గడ్డి కొరకాలి గదా ?.... ఇది అన్యాయ మెందుకౌతుంది ? ఇక— పాప మంటావా ?.... మీరు ఇవ్వగలిగినదేదో ఈ నాడు నేను పుచ్చుకుంటున్నాను. కనుక— ఆ పాప పుణ్యాలేవో మీవే!'' అంటూ సర్వమంగళం జింక గొంతు దొరక బుచ్చుకుంది.

సుందరాంగం ఆ ఘోరం చూడలేక పారిపోయింది.

జింక కాళ్ళు కొట్టుకొంటూ విగుడుకున్నాయి. దాని ప్రాణం బొందిలో నుండి ఎగిరి పోయింది.

చెట్టుమీద కూర్చున్న చిట్టికోతి ''ఎంతో బాలుగు !'' అన్నది.

ఇప్పుడిప్పుడు దాన్ని మంచి చేసుకోవాలని శత విధాల ప్రయత్నిస్తున్నది పులి. ''ఏమిటోయ్ నేస్తం ! నువ్వు అన్నిట్లోనూ ఆరితేరిన వాడిలా ఉన్నావే ! అంకెలు ఎంతవరకూ వచ్చునేమిటి ?''

''నూటొక్కటి వరకే !'' అంది కోతి.

''ఆటు తర్వాత నేర్చుకోలేదా ?''

''నేర్చుకోవలసిన అవసరం కనిపించలేదు.''

''ఎందుకు ?''

''అయ్యా సర్వమంగళం గారూ ! నేను లెక్క పెట్టుతున్నది ఏమిటనుకున్నారూ ? తమరి పాపాలు! మూరుదాకా ఫరవాలేదు. నూటొక్కటితో తమరి పాపం పండిపోతుంది. అందాకా లెక్క పెట్టుకోడానికి నూటొక్కటి వరకు చాలు !''

''పొగరుబోతా ! అంతవరకూ నిన్ను లెక్కపెట్ట నిస్తానా మామకో ?....'' అంది పులి కసిగా.

''అది కలలో మాటండోయ్! తమరు చచ్చిన తర్వాత తమరి ఎముకలు కూడా లెక్కపెడతాను నేను.'' అన్నది చిట్టికోతి.

మరొకరోజున— పచ్చికైనా మేయకుండా పొయలలో దిగులుగా కూర్చున్నది సుందరాంగం. చిట్టికోతి దాని దగ్గరకు వచ్చి కూర్చుంది.

''ఏమిటయ్యా ! జింకల దొరా ! అలా ఉన్నావు?''

సుందరాంగం కన్నీళ్ళు కారుస్తూ ఇలా అంది. ''వేరే కారణమంటూ ఏముంది నేస్తం ? మా జాతి క్షీణాన్ని తలుచుకుంటే గుండె చెరువై పోతున్నది. పులిరాజుకు నేనేం అపకారం చేశాను ?.... మా కష్టాలు గట్టెక్కే మార్గమే లేదా ?....''

''లేకేం ? ఉంది ! నేను చెప్పినట్టు చేస్తావా?''

''చెప్పు !''

''సర్వమంగళం చావాలి— అని వినాదం చెయ్యి కుందాం.''

''రామ రామ !'' అంటూ చెవులు మూసుకొంది సుందరాంగం.

''నీ చచ్చు సిద్ధాంతాలంతా కట్టగట్టి గంగలో పారేయ్ ! సర్వమంగళంతో కపట స్నేహం అవలంబించు. సమయం చూచి నీ కొమ్ములతో దాని రెండు కళ్ళూ పొడిచెయ్యి. లేకపోతే— నువ్వు కూడా స్వాహా !''

''ఆయ్యో ! జీవహింస మహా పాతకం కాదా ?''

''అయ్యా రామరాం ! నేను చెప్పవలసింది చెప్పాను. దాని మాటట నీ ఇష్టం ! నిజానికి నిన్నెవ్వర్నీ పులి చంపడం లేదు. మిమ్మల్ని మీరే చంపు కుంటున్నారు.'' అన్నది కోతి.

ఇంతలో— పులి గాండ్రింపు వినబడింది.

''మిత్రమా ! తలవ్రాతను ఎవరూ మార్చలేరు. చంపడమో, చావడమో— రెండిటిలో ఒకటే మార్గం !'' అంటూ కోతి చెట్టెక్కింది.

.... చాల సేపటి నుండి పులి మేతకోసం వెదకుతున్నది. ఒక్క మృగం కూడ దాని కంట బడలేదు. ప్రాణభయంతో అవి ఎక్కడో తలలు దాచుకున్నాయి.

సుందరాంగాన్ని చూచి దగ్గరగా వచ్చింది సర్వమంగళం. ''జింకల రేడా ! ఈ వేళ నీ వంతు ! నీ మరణం పట్ల నా సంతాపం తెలియ జేస్తున్నాను. నీ ఆత్మకు శాంతి కలుగుగాక !'' అన్నది.

సుందరాంగం భయంతో కంపించి పోయింది. ''హరిణరాజా ! నన్ను కరుణించవా ?.... ప్రాణ భిక్ష పెట్టవా ?'' అంటూ దీనంగా బ్రతిమాలు కొంది.

పులి అంతకంటె దీనంగా— ''హరిణ రాజా ! నన్ను కరుణించవా ? నా ఆకలి తీర్చవా ?'' అంటూ సుందరాంగం మీదికి దూకబోయింది.

సుందరాంగానికి అంత పట్టుదల ఎక్కడి నుండి వచ్చిందో— అది పులిబారి నుండి తప్పించుకోడానికి బాణంలా పరుగెత్తి పోసాగింది. పులి దాన్ని వెంటాడింది.

సుందరాంగం పిరికొండల మీద నుంచి ప్రతిదికి పరుగులు పెట్టింది. చిట్టడివి చేరుకొంది. దాన్ని తరుముతూ వస్తున్న పులిని టక్కుటమారంతో ఆపి, ''గురూ ! అది బంగారు దగ్గరికి వెళ్ళుతున్న

48 వ పేజీ చూడండి





# కల్పన

'వై. రాంబాబు. బాబు'

"మహాశియాగం గుర్రాలంటే మహాప్రసిద్ధి. ఎక్కడెక్కడి వాళ్ళూ కోటిపల్లి వచ్చి, గుర్రాలను కొనుక్కు పోతుంటారు. శివరాత్రి తీర్థం తరువాత గుర్రాల తీర్థం జరుగుతుందండీ ఇక్కడ. మాహీ యాగం నుంచి మహాదొడ్డ గుర్రాలు వస్తాయి లెండి ! గుర్రాల తీర్థం కళ్ళారా చూడాలే గాని, ఎంత గొప్పకవైనా దాన్ని వర్ణించలేడు. ఇంక తీర్థానికి వచ్చే వాళ్ళంటారా —సిల్కు లాల్చీల ప్రభువులూ, జరీ కండువాల దొరలూ, మెలితిప్పిన గండు మీసాల జమీందారులూ, బంగారు పొన్ను కర్రలు చేత్తో ధరించిన ఆసాములూ.... ఎక్కడెక్కడి డబ్బున్న వాళ్ళూ గుర్రాలు కొనడానికి కోటిపల్లికి దిగుతారు...."

చెప్పడం ఆపి, ఆ పెద్ద మనిషి శ్రోతల నిద్దరనూ ఒకసారి పరికించాడు. వాళ్ళిద్దరూ తను చెబుతున్న మాటలన్నీ శ్రద్ధగా వింటున్నారన్న నమ్మకం కలిగాక తన కథనాన్ని అతడు కొనసాగించాడు.

"ఇప్పుడు మనం కూర్చున్న ఈ కోట దాదాపు నాలుగు వందల సంవత్సరాల క్రితం కట్టిందని ఇక్కడి వాళ్ళు అనుకొంటూ ఉంటారు. అసలు కోట కట్టించిన జమీందారెవ్వరో తెలియదు గాని తరువాత అక్రమంగా దానిని ఆక్రమించుకున్న జమీందారు సంగతి మీకు చెప్పాలనుకుంటున్నాను"

ఆయన ఎందుకాగాడో శ్రోతలిద్దరకూ అర్థమైంది. ఒక్కక్షణం పెద్దమనిషి ముఖం వంకా, బయట మేఘావృతమై భయంకరంగా మెరుస్తూ వర్షిస్తున్న ఆకాశం వంకా చూచి, "ఇంతకూ మీపేరేమిటో చెప్పారు కాదు" అన్నాడతను.

పెద్ద మనిషి నవ్వి, తన పేరు చెప్పాడు— "వెంకట్రామయ్య."

వెంకట్రామయ్యకు దాదాపు మూడు పదులు వయస్సు ఉండవచ్చు. మెలితిప్పిన మీసాలపైన అతని దక్షిణ హస్తం దాదాపు ప్రతి నిమిషమూ నాట్యమాడుతూనే ఉంది. ఆరోగ్యవంతమైన అతని శరీరానికి అచ్ఛాదనేమీ అవసరం లేదన్నట్లు ఒక మిలియూరన్ బనియను మాత్రం ఒంటి మీద ఉంది. ఎర్రపంచె ప్రాతదనానికి, పెద్దరికానికి చిహ్నంగా అతనికి నిండుదనాన్ని కలిగిస్తున్నది.

వెంకట్రామయ్య తన పేరు చెప్పినప్పుడు నవ్విన నవ్వులో, చూచిన చూపులో తళుక్కుమన్న గర్వరేఖ— పేరు చెప్పిన తీరులో ద్యోతకమైన అహంభావం చూచి మనస్సులో జగుప్స కలిగింది శ్రోతలలో రెండవవారికి.

"మీ పేరు ?" అడిగాడు, అట్లా నవ్వుతూనే వెంకట్రామయ్య.

బయట హోరున వర్షం కురుస్తూనే ఉంది. గాలి తీవ్రత అంతకంతకూ హెచ్చుతున్నదే కాని కొంచెం కూడా తగ్గలేదు.

"నా పేరు విశ్వనాథరావు. విశాఖపట్నంలో ఆయిల్ కంపెనీలో పని చేస్తున్నాను. మొన్న మొన్ననే వివాహమైంది. ఈమె నా భార్య— కల్పన. గోదావరి చూడాలని వచ్చాం" అన్నాడు.

కల్పన తల వాల్చుకుని దూరంగా వర్షపు నీరు ప్రవహిస్తున్న వేపు చూస్తోంది. వాతావరణం భయంకరంగా ఉండడమే గాక, నిర్జనమైన ఆ ప్రదేశం ఆ రాత్రి వేళ మరింత భయానకంగా ఉంది. తిని, తిరిగా కూచుండక, అనవసరంగా ఇక్కడకు వచ్చామా అనిపించింది కల్పనకు. ఆకాశ కాంత గుండెలో మెరుపుల్లాగానే కల్పన హృదయాకాశంలోనూ భయోత్పాతంపాలతలు మెరవ సాగాయి. ఆమె పదునెనిమిదేళ్ల బంగారుకొమ్మ. విశాఖలో పుట్టి పెరిగినా నేటి అతి నాగరకతకు గాని, కోటిపల్లి గ్రామీణతకు గాని అలవాటు పడని స్వభావమామెది. వివాహమై ఈ రోజుతో పది. గోదావరీ నదీమతల్లిని చూడాలన్న కోర్కతో దంపతులిద్దరూ సుందరపల్లి చుట్టాలింటికి వచ్చారు. గోదావరిని చూచి తిరిగి వెడుతూ, దారిలో తీవ్రమైన తుఫానుకు చిక్కుకుని "పాతకోటలో తలదాల్చుకోవలసి వచ్చింది.

"అమ్మాయిగారేదో ఆలోచిస్తున్నారు కాబోలు —మీ ఆలోచనలన్నీ అక్కడ ఆపి, నే చెప్పేది వినండి...." అంటూ చెప్పడం ప్రారంభించాడతను.

"నేను చెప్తున్న కథకు నాయకుడు బంగారు రాజు. బంగారురాజు పేరెత్తితే చాలు ఇప్పటికీ ఈ కోటిపల్లి ప్రాంతాల వాళ్ళు గజగజ లాడతారు. ఆయన అక్రమంగానే ఈ కోటను ఆక్రమించుకున్నాడట ! కోటలో పురుషులెవరూ లేకుండా చూచి, ఆడవాళ్లతో సహా కోటను తన స్వాధీనం చేసుకుని, తన బలగంతో కోట యజమానులను మట్టుపెట్టించాడని చెప్పుకుంటారు. అటువంటి దుర్మార్గుడు రాజు. అప్పటికి కొత్తకోట కట్టలేదు. కొత్తకోట అంటే చూశారా— దాదాపు దీనికి తిన్నగా మూడు మైళ్ల దూరంలో ఇదే స్థితిలో మరొక కోట మీకు కనిపిస్తుంది. అది ఈయన హయాంలోనే కట్టించాడు కాబోలు...."

విశ్వనాథరావు కథకు అడ్డువచ్చాడు.

"మీరీ కథ ప్రారంభించడంలోనే గమ్మత్తుగా ఉంది. అసలు విషయం ఏదో దూరంగా ఉంచి, వూరికే కథా ప్రారంభంలోనే ఉండి పోయారు. నాకు సాహసిక నవలలంటే చెప్పలేనంత పిచ్చి. ఆ నవలల్లో కనిపించే మాదిరిగా ఈ కోట— ఈ వాతావరణం— మీరు కథ చెప్పే తీరు చూస్తుంటే నా మనస్సు వూరికే వెర్రి ఉత్సాహంతో పొంగి పోతోంది.... కానివ్వండి" అన్నాడు విశ్వనాథరావు, లాల్చీ జేబులో సిగరెట్ పెట్టె కోసం చేయి పెట్టి.

"మీ ఉత్సాహం చూస్తే నాకూ సరదాగానే ఉంది. అసలు— కథలో మన జమీందారే సరదా పురుషుడు. ఆయన ఆజానుబాహువు. గిరజాల జుట్టు— బయటికి ఉబికి వచ్చిన కళ్ళు— పొడుగాటి ముక్కు— సన్నగా మెలితిరిగిన మీసం— సన్నని పొడుగాటి అంగీ— కుడి చేతిలో మందు సీసా, ఎడమ చేతిలో పొడుగాటి చుట్ట. బంగారు రాజు దర్శనం సాధారణంగా ప్రజలకు కలిగేది కాదట ! ఎప్పుడూ ఆయన మందులోనే స్నానం చేస్తూ ఉంటే తిరిగెక్కడ దొరుకుతుందండీ ! ఇంతే కాదు— మరో సద్గుణం కూడా ఉంది...."

విశ్వనాథరావు లేచి నిలబడి, "ఆగండి. వెంకట్రామయ్యగారూ ! ఆ చప్పుడేమిటి ?" అన్నాడు, కోటలోపలికి చూస్తూ.

మెరుగుతున్న క్రొవ్వత్తి ఆ ప్రదేశానికి ఒకింత వెలుగును ప్రసాదిస్తున్నది గాని, కోటంతా చీకటి గుయ్యారంలా ఉంది. కల్పన కోటలోపలికి దృష్టి పారించింది. వాళ్ళు ముగ్గురూ కోట సింహద్వారానికి ప్రక్కగా నున్న ఒక వితర్దిపై కూచున్నారు. దాదాపు కోటంతా శిథిలావస్థలో ఉంది. కూలిన గోడలు చెరగి పోయిన నాటి వైభవానికి చిహ్నంగా నిలిచి ఉన్నాయి. శృంగారం వెల్లివిరిసిన గదుల్లో నేడు విరిగిన గోడల పెళ్ళలు, బూడిద, బూజు, పాతగూళ్ళ భయంకర రూపాన్ని ఆపాదిస్తూ, జుగుప్సాకరమైన దృశ్యం కళ్ళెదుట నిలబడుతూ ఉంది. అక్కడక్కడ పిచ్చి మొక్కలు, తాటిమట్టలు, ఉత్తరేణి మొక్కలు నానా బీభత్సంగానూ అలముకుని ఉన్నాయి. చీకటి మాటున దాగి ఉన్న ఈ శిథిలమైన కోట తాలూకు దృశ్యాలు మెరుపుల వల్ల అప్పుడప్పుడు కనిపిస్తూ, మరింత భయాన్ని కలిగిస్తున్నాయి.

వెంకట్రామయ్య కూడా ఆ శబ్దం ఏమిటో వినాలని చెవులొగ్గాడు. కల్పన భయాందోళనలతో కూడిన మనస్సుతో ఆ శబ్దం వినాలని యెదురు చూస్తూ ఉన్నది, కోటలో— ఆ భయంకర వాతావరణంలో ఒకస్త్రీ వికటాట్టహాసం లీలగా వినవస్తున్నది. కంచుఢక్క పగిలిన శబ్దంతో ఉపమింప దగ్గ ఆ వికటహాసం— దానితో బాటు కొన్ని మాటలు... "రా! రా! నీ పీకనులిమిచంపుతా— కోటిపల్లి ముత్యాలమ్మ నిన్ను మింగుతుంది రారా !"

విశ్వనాథరావు గుప్పిళ్ళు బిగించాడు. అతని శరీరం గగుర్పొడిచింది. మనస్సు వెర్రి ఉత్సాహంతో శరీరంపై వణుకు కలిగిస్తోంది. "వెంకట్రామయ్యగారూ ! ఆ స్త్రీ— పాపం— ఎవరి చేతుల్లోనో పడి..."

వెంకట్రామయ్య కహకహ నవ్వాడు. ఆ వెకిలి నవ్వు కల్పనలో భయాన్ని, విశ్వనాథరావులో ఆవేశాన్ని పెంపొందించాయి. "కూర్చోండి. విశ్వనాథం గారూ ! మీరు వూరికే ఆవేశ పడొద్దు. ఆ కథే మీ కిప్పుడు చెబుతున్నాను...."

విశ్వనాథరావు కూర్చున్నాడు. అతని శరీరం ఇంకా వణకుతూనే ఉంది. కల్పన అతని చేతిని స్పృశించి— "ఆవేశం పెంచుకోకండి— ఇది కూడా ఒక కథే" అంది, అతన్ని మామూలు స్థితిలోనికి లాగాలని.

కోటలో నిద్దు మణిగింది. బయట వర్షం కుంభపోతగా కురుస్తూనే ఉంది. విశ్వనాథరావు టైమ్ చూచుకున్నాడు. దాదాపు తొమ్మిది గంటలైంది. ఈ వర్షం వదలేవిధం కనిపించడంలేదు. ఇంక ఈ రోజుకు తాము కాకినాడ చేరటమనేది అసంభవం. బయలుదేరడానికి వర్షం తగ్గాలి. చెడి పోయిన కారును బాగు చేయాలి. రాత్రికి రాత్రి అది అసంభవం.

"చెప్పండి—" అన్నాడు విశ్వనాథం.

ఉత్సాహంతో వెంకట్రామయ్య కథనం సాగించాడు.

* * *

బంగారు రాజు జులాహీ పురుషుడు. అతనికి

క్రొత్త మీద చెప్పలేనంత మోజు. అతను పెలకో మాళియాగం గుర్రాన్ని మార్చినట్లే రోజుకో స్త్రీని మార్చగల దౌర్భాగ్య గుణాన్ని అలవాటు చేసుకున్నాడు. మద్యంతో ఎరుపెక్కిన అతని కనులకు నవనవలాడే మదవతి దర్శన మిస్తేగాని, అతనికి ప్రొద్దు గడవదు. కథల్లో మాదిరి అతని ఈ కామ యజ్ఞానికి ఎక్కడెక్కడి నవయువతులూ ఇంధనాలుగా తేబడుతూ ఉండేవారు. బంగారు రాజు కుడిభుజం సింగడు. భీముని వంటి సింగని పేరు అందరికీ సింహస్వప్నం. వాడికి చిలకలవేటలో రాను రాను చెప్పలేనంత చాతుర్యం ఏర్పడింది.

రోజులీ విధంగా జరుగుతూండగా గుర్రాల తీర్థం వచ్చింది. కోటిఫలిలో కోటానుకోట్ల గుర్రాలు దిగాయి. గోదావరి ఒడ్డున విశాలమైన మైదానంలో గుర్రాలను తీసుకు వచ్చిన ప్రజలు విడిది దిగారు. గంగవరం, విజయ రాయుడు పాలెం, పెద్దపురప్పాడు, పాతర్లగడ్డ జమీందారులు తమ భట సముదాయంతో దిగారు. జగన్నాథపురం, కాకినాడ ప్రభువులు, కోటిఫలి దొర వగైరా పెద్దలు తీర్థంలో మంచి గుర్రాల నెన్నుకోడానికి వచ్చారు. బంగారు రాజుగారికి ఒకసారి తీర్థానికి వెళ్లిరావాలని బుద్ధి పుట్టింది. ఏ నాడూ మేడ దిగని ప్రభువు మద్యపాన మాంద్య ప్రాదయంతోనే తూలుతూ, మెట్లుదిగాడు. రథమెక్కాడు. అతనికి అప్పుడు ప్రకృతి నవ వధువులా సాక్షాత్కరించి, ఆహ్లాదాన్ని కలిగించింది. తీర్థంలో తేరు దిగిన బంగారు రాజు— ప్రక్కనే స్వామి భక్తుడై చేతులు జోడించి నిలిచిన సింగని వెంట, తీర్థం లోపలికి నడక సాగించాడు.

ఆ తీర్థ మెట్లా ఉన్నదయ్యా— తలపాగాల వారూ, జరీ అంచు కండువాలవారూ— పొన్ను కర్రల వారూ, పొడుగాటి చుట్టల వారూ, కిర్రు చెప్పులవారూ, పొడుగు అంగీలవారూ.... ఓహో! ఆ నాటి తీర్థం చూడ ముచ్చటగా ఉంది. ఉత్సాహం వెల్లివిరిసిన జనసందోహంతో వరదవచ్చిన గోదావరిలా ఉంది. అశ్వఘోషలతో మరింత హడావిడిగా కనిపిస్తూ ఉంది. నడుస్తున్న బంగారు రాజు చట్టున ఆగిపోయాడు. దొర ఆగిపోయాడని సింగడూ ఆగాడు. కారణమేమిటని కన్నెత్తి చూస్తే —ఎదురుగా గుర్రాలమ్మే పెద్ద మనుషుల్లో ఒక చిన్నది. వయసులో చిన్నది. అందంలో మిన్నయైనది. కవ్వించే కన్నులు కలది. అస్తినాస్తి విచికిత్సాతోదరి.

"సింగా!"

"ప్రభూ!"

"ఆ చిన్నదాని సోయగ మేమిరా!"

"చిత్తం ప్రభూ!"

"మనసు బరువెక్కుతున్నదిరా!"

"ప్రభూ!"

"చూడరా సింగా! ఇది ఈ రాత్రికే...."

"దొరా!...." సింగడి గొంతు వణికింది.

బంగారురాజు మరి ఒక్క క్షణమైనా అక్కడ ఆగలేదు. రథమెక్కి కోటకు తిరిగి వచ్చాడు. మెట్లెక్కి, మెత్తని శయ్యపై వ్రాలి, ఒక సీసా త్రాగాడు. చుట్టపై చుట్ట పీల్చాడు.

సాయంకాలమైంది. పాపంలాగా చీకటి అలుముకుంది. కోటలో దీపాలు వెలిగాయి. మేడపై మహారాజుకు తెలివిలేదు. తాగిన మైకంలో పడి ఉన్నాడు. అర్ధరాత్రి వేళ సింగడు వచ్చి లేపాడు. బంగారు రాజు మత్తుగా కళ్లెత్తి చూచాడు.

"ఏమిరా సింగా!"

"చిలకను తెచ్చాను దొరా!"

ఫకాళించి నవ్వాడు బంగారు రాజు.

"భళిరా సింగా! మహ మంచి బంటువురా! ఇదిగో కానుక—" ఒంటి నున్న బంగారు గొలుసు సింగడి చేతుల్లోకి విసిరాడు.

సింగడు గొలుసును కళ్ల కద్దుకొని, బొడ్డున దోపుకుని, "దొరా! ఆ గదిలో—" అన్నాడు సెలవు తీసుకుంటూ.

* * *

ఫెళ ఫెళ ఆకాశం ఉరిమింది. వర్షం కుండపోతగానే ఉంది. బయట నుంచి వర్షం నీరు విరిగిన సింహద్వారపు గడప గుండా లోపలికి పారివస్తున్నది. కూర్చున్న అరుగు చుట్టూ నీరు చేరింది.

కథ ఆపి, వెంకట్రామయ్య చుట్ట వెలిగించుకున్నాడు. చేతిలో సిగరెట్ పీక్క నీటిలోకి విసిరి, విశ్వనాథరావు కూడా సిగరెట్ వెలిగించుకున్నాడు. బాహ్య ప్రపంచంలో ఏమి జరుగుతున్నదీ వాళ్ల ముగ్గురికీ తెలియడం లేదు. వెంకట్రామయ్య చెప్పడం ప్రారంభించాడు.

"బంగారు రాజు జీవితంలో ఎన్నో పాపాలు చేశాడు. మంచి పని ఒక్కటీ ఎప్పుడూ చేయలేదు. ఎందరి జీవితాలో అతని చేతుల్లో నాశనమై పోయాయంటే! ఎన్ని పాపాలు చేసినా అతనెప్పుడూ పశ్చాత్తాప పడలేదు. పాపాలు చేయడమే పనిగా పెట్టుకున్నాడు. ఇంక సింగడి దుర్మార్గాలు ఏమని చెప్పేది!? ఇవన్నీ మా తాత చెబుతూ ఉంటే, నాకు భలేకోపం వచ్చేది. నేనే గనుక ఆ రోజుల్లో పుట్టి ఉంటే, బంగారు రాజు పీక కొరికి ఉందును. వాడి అన్యాయాలు మాసిపోను! వాడిది గుండెకాదు— రాయి" పళ్లు పటపట లాడిస్తూ అన్నాడు వెంకట్రామయ్య.

విశ్వనాథరావు విసుగ్గా అన్నాడు— "కథ చెప్పండి"

"ఆఁ ఆఁ.... అదే చెబుతున్నా— ఆ చిన్నది పాపం— ఎక్కడి నుండో గుర్రాల వర్తకుల కూడా వచ్చింది. వయస్సులో చిన్నదే కాని ఆపిల్లకు పెళ్లైపోయింది. ఒక పాపాయి కూడా. అర్ధరాత్రి వేళ ఆ పిల్లకు మత్తు మందు పెట్టి ఎత్తుకొచ్చాడు సింగడు. తెచ్చి, మేడమీద గదిలో పడవేశాడు, పాపం! ఆ చిన్నదానికి మెలకువ వచ్చి చూస్తే, ఎక్కడో గుర్తు తెలీని చోట— అర్ధరాత్రివేళ— భయం వేసింది. భయం కాదండీ మరి! ఇప్పుడు— ఈ స్థలంలో ఎన్నిపాపాలు జరిగాయో అంత దట్టంగా చీకటి ఉంది. ఈ చీకట్లో మనకెంత భయంగా ఉంది! ఆడపిల్ల పాపం— సింగడు వెళ్లిపోగానే బంగారు రాజు పట్టెమంచం దిగకుండానే "పిల్లా!" అని గావుకేక పెట్టాడు. ఆ కేక విని గజగజ వణికి పోయిందా పిల్ల. మంచం దిగి మహారాజు పక్క గదిలో అడుగు పెట్టాడు. ఆ పిల్ల వణకుతూ ఒక మూలకు ఒదిగింది....

మూల కొదిగిన ముద్దు గుమ్మను చూచి ముచ్చట పడ్డాడు బంగారురాజు. మూతి మూడు వంకరలు తిప్పుతూ నవ్వాడు— మురిసెంగా.

"చిన్నదాన! భయమెందుకే?" అని పరామర్శించాడు.

ఆ చిన్నది భయంతో ముడుచుకుపోయి, మరింతగా గోడకు అతుక్కు పోయింది.

"ఏమే నీ పేరు—"

చెప్పలేదు.

"చెప్పవేమే సింగారీ!"

వణకే గొంతుతో— "నీల...." అన్నది.

"నీల" అని, నవ్వాడు రాజు. ఆ నవ్వు నీల గుండెల్లో పిడుగులా పడి, ప్రతిధ్వనించింది.

"నిన్ను చూసినది మొదలు నిలవదేమే నా మనసు? నీవు సింగారివి సుమ! బంగారు బొమ్మవు గద! ఊఁ— పలకవేమే...."

భయాందోళనలతో సతమతమై పోతూ నీల ఏమని మాట్లాడుతుంది!? గొంతు ఎండిపోతున్న దామెకు. గుండెల వేగం అధికమవుతూ ఉంది. ఈ పులిబారి నుంచి తప్పించుకునే దారేది? ఆమెకు అర్థం కావడం లేదు— బంగారు రాజు మరీ దగ్గరగా వస్తున్నాడు.

"ఆగు—" వణకుతూనే అంది నీల. ఆగలేదు రాజు. మరో అడుగు ముందుకు వేశాడు. నీలకు ఏం చేయాలో పాలుపోలేదు. వేటగాడు తనవైపే వస్తున్నాడు. గజదొంగ తన మీదికి వస్తున్నాడు. తన దగ్గర యౌవనధనమున్నది. కాని, అది అప్పటికే తన భర్తకు అంకితం చేయబడింది. తనలోని అనురాగం తన భర్తకు, పసిబిడ్డకు పంచి ఇచ్చింది. ఇక ఏమి మిగిలిందని ఈ దుర్మార్గుడు తన మీదికి వస్తున్నాడు? బంగారు రాజు చేయి ముందుకు చాచాడు.

"రావే— వరాల కూన!"

వరాలకూన అందలేదు. ఒడుపుగా గోడ మూల నుంచి, అటువేపు, గుమ్మం దగ్గరకు పరుగెత్తింది. గబగబ గది బయట పడి, మెట్ల దగ్గరకు వచ్చింది.

"ఆగవే పిల్లా! పారిపోకు— పారిపోయినా నువ్వు తప్పించుకోలేవు" అని అరిచాడు రాజు.

మెట్లమీద కాలు జారింది నీలకు. జరజర జారిపోయింది క్రిందకు. భయాందోళనలతో "అమ్మా!" అని గావుకేక పెట్టింది. నేలమీద పడి, మరి లేవలేక పోయింది పిల్ల. లేవాలని ప్రయత్నించింది

---

కొడుకు: అమ్మా! పాపం ఆ ముసలివానికి ఒక బేడ వుంటే ఈయవే.

తల్లి: ఎవరబ్బాయి ఆ ముసలివాడు?

కొడుకు: మిఠాయి అమ్మే ముసలివాడే.

పి. సుబ్రహ్మణ్యం (కీళపట్టు)

---

రక్త సిక్తాలయిన అంగాలతో మూలుగుతూ ఉన్న పిలను సమీపించాడు రాజా.

"పారిపోదా మనుకున్నావటే బంగారు బుజ్జీ!" అన్నాడు కకవిక నవ్వుతూ.

ఒళ్లు తెలియులేదు పిలకు. ఎక్కడలేని ఆవేశమూ ముంచెత్తింది. ఆమె కళ్లు చింత నిప్పు లయ్యాయి. ఆ ఆవేశంతో ఆమె లేచి నిలబడింది.

"రారా! కోటిపల్లి సోమన్న నీ గొంతు కొరుకు తాడు రారా! ఒరే! సోమన్న దేవేరి రాజేశ్వరమ్మ నీ కళ్లు పీకేస్తుంది రారా! కోటిపల్లి ముత్యాలమ్మ నిన్ను మింగుతుంది—" అంటూ వీరావేశంతో అరవసాగింది.

ఆ ఆవేశం చూచి బంగారు రాజా తబ్బిబ్బయ్యాడు. అతనిలో ఎన్నడూ లేని ఒక భయురేఖ లీలగా మెరవ సాగింది. ఇంత మంది స్త్రీలు తన కాహుతి అయ్యారే గాని, ఏ ఒక్కరూ తనకింత భయాన్ని కలిగించిన వారు కారు.

పిల ఇంకా శివమాడుతూనే ఉంది.

"రా! రా! అలా చూస్తూ నిలుచున్నావేం? నీ పీక నులిమి చంపుతా! రారా!"

ఆమె దగ్గరకు పోవడానికే అతనికి భయమైంది. అయినా, మనిషికి ఒకవిధమైన పిచ్చిధైర్యం ఉండడం సహజం. ఆ పిచ్చి ధైర్యంతోనే బంగారు రాజా ముందడుగు వేశాడు.

రాజా దగ్గరకు వస్తుంటే పిల కళ్లు ఎర్రని జ్యోతులయ్యాయి. ఆమె వీరతాండవమే చేస్తున్నది.

"బిడ్డతల్లిని నన్ను తెచ్చావు. కూటికి లేని దానిని నేను. అయినా కులంలేని దాననుకాను. నన్ను బలి చేయ పూనుకున్నావు గద! రా! నా శరీరంపై నీ వ్రేలు పడితే చాలు— నువ్వు రక్తం కక్కుకుంటూ చచ్చేలా ముత్యాలమ్మ చేస్తుంది— రా!" అని అరచింది పిల.

బంగారురాజా నవ్వలేదు. పిచ్చి ధైర్యంతో పిల దగ్గరకు నడిచాడు. ఈ సారి బిగ్గరగా నవ్వేవంతు పిలదే. ముత్యాలమ్మలా నవ్వింది. ముల్లోకాలూ వణకేలా నవ్వింది. రాజా పిలకొప్పును చేత్తో పట్టు కున్నాడు. రెండవ చేత్తో ఆమె నడుము బిగించాడు.

* * *

సరిగ్గా పిడుగు పడింది. ఆ పిడుగు పాటుకు ముగ్గురూ భయపడ్డారు.

"పిడుగు పాటుకు చెట్టులాగా 'అమ్మో!' అని అరుస్తూ పడిపోయాడు బంగారు రాజా. అతని నోటి నుంచి రక్తం కారింది. గిజగిజ తన్నుకు చచ్చాడు...."

కల్పన ఆత్రంగా అడిగింది— "మరి— పిల ఏమైంది?"

"పిల ఏమైందో ఎవ్వరికీ తెలీదు. ఆ నాటి నాత ఈ కోట పాడుబడి పోయింది. ఈ ప్రాంతా లకే ఎవ్వరూ రావడం మానివేశారు. పిల ఇప్పటికీ ఈ కోటలోనే తిరుగుతుందని ఇలాగే అరుస్తూ ఉంటుందని చెప్పుకుంటూ ఉంటారు."

"అయితే, పిల యింకా ఈ కోటలోనే ఉందం టారా?" అని అడిగాడు విశ్వనాధరావు ఉత్సాహంతో.

"పిల బ్రతికి ఉందని అనుకోడం కన్న, ఆమె ఆత్మే ఈ కోట చుట్టూ తిరుగుతూ ఉందని అను కోడం మంచిదేమో! ఇన్నేళ్ల తరువాత పిల బ్రతికి ఉంటుందనడం పిచ్చితనం కదండీ!"

"వెయ్యేళ్లు బ్రతికినవాళ్ల సంగతేమిటి? ఇప్పుడు వినిపించిన కేకలు చూస్తే— పిల బ్రతికే ఉందనుకుంటున్నాను...." అన్నాడు విశ్వనాధరావు.

వర్షం కొంచెం తగ్గుముఖం పట్టింది. విశ్వ నాధరావు టైమ్ చూచుకున్నాడు. పదకొండు గంటలు దాటింది.

"సుందరపల్లిలో మేము బయలుదేరేసరికి ఆకాశం నిర్మలం. ఉంది. అకస్మాత్తుగా తుఫాను ముంచుకు వచ్చింది. దానికి తోడు మా కారు ట్రబుల్ ఇచ్చింది. ఎవరైనా మెకానిక్ వస్తేనే గాని అది బాగయ్యే వీలులేదు. ఈ పరిస్థితుల్లో మేము ఈ రోజుకు కాకినాడ చేరుకోవడం అసంభ వం" అని నిట్టూర్చాడతను.

"ఫర్వాలేదు— ఈ రాత్రికి ఇక్కడే నిద్ర పోవచ్చు మీరు. ఏమైనా తినుబడి పదార్థాలు తీసుకు వస్తాను. ఒక రెండు ఫర్లాంగుల దూరంలో ఒక అంగడి ఉంది. ఆ అవ్వ దగ్గర ఏమైనా వేయించిన శనగలు వగైరా దొరుకుతాయి. పాలు కూడా తీసుకు వస్తాను...." అని లేచాడు వెంకట్రామయ్య.

విశ్వనాధరావు అతని ముఖంలోకి చూచాడు.

"మీరు అనవసరంగా శ్రమ తీసుకోవద్దు. అపరిచితులైనా ఆత్మబంధువుల్లా ఈ భయంకర నిర్జన ప్రదేశంలో కొంచెం ఆదరాన్ని చూపించారు. ఇంతకన్న మాకేమి కావాలి? ఈ అర్ధరాత్రి వేళ ఆకలేమిటి?" అన్నాడు.

వెంకట్రామయ్య గొడుగు విప్పి— "ఏం ఫరవా లేదండీ! గోదావరిని చూడాలని వచ్చి, కోటలో చిక్కుకున్నారు. మా ఇల్లైతే చాలా దూరంలో ఉంది గనక, భోజనాల ఏర్పాటుకు వీలుకలగదు. అందుచేత, కనీసం ఈ మాత్రమైనా చేయ నీయండి. కొంచెం జాగ్రత్తగా ఉండండి— పది నిమిషాల్లో తిరిగివస్తాను." అని చెప్పి, మరి చెప్పే దేమీ వినిపించుకోకుండా అతను బయటికి వెళ్లి పోయాడు.

ఒక దీర్ఘనిశ్వాసం విడిచి, విశ్వనాధరావు కల్పన ముఖంలోకి చూచాడు. ఆమె భయాందోళనలు ముప్పిరిగొన్న శిల్పంలా కూర్చొని ఉంది. అతిరుతో ఆమెను చూచిన అతని పెదవులపై దరహాసమువం విరిసింది. ఆమె భుజం మీద చెయ్యివేసి, "భయ పడుతున్నావా? కల్పనా!" అని అడిగాడు.

కల్పన నిశ్శబ్దంగా కనులెత్తి, అతని కళ్లల్లోకి చూచింది. విశ్వనాధరావు ఆమె నుదుట పడి ఉన్న జుత్తును స్పృశిస్తూ— "ఇంత చక్కని సన్ని వేశం సాధారణంగా జీవితంలో ఎదురు పడదు. ఆయన చెప్పిన కధ ఎంత చిత్రంగా ఉంది! ఎన్నో కధలు చదివాను. ఆ కధల్లో మాదిరిగానే భయం కరంగా ఉంది ఈ కధ కూడా. అవునా!" అన్నాడు.

ఆమె మవునంగానే ఉండి పోయింది.

గాలి వేగంగా వీచి, సన్నగా వెలుగుతున్న క్రొవ్వత్తి ఆరిపోయింది.

"అబ్బ! చీకటి—" అంది కల్పన, విశ్వనాధ రావు దగ్గరగా జరిగి.

బయట వర్షం తగ్గిపోయింది. చెట్ల మీద నుంచి క్రిందికి పడే నీటిబొట్లు క్రింద పరుగెత్తే నీటిలో పడి. శబ్దిస్తున్నాయి. ఆ టపటప శబ్దం ప్రకృతి దేవత హృదయు చలన శబ్దంలా భయం కరంగా ఉంది.

దూరం నుంచి నిర్జన ప్రదేశపు చల్లని గాలి మెల్లగా ప్రాకి వస్తోంది. ఎక్కడా పిసరంతైనా వెలుగు కనిపించడం లేదు. కల్పన విశ్వనాధరావులో కలిసిపోయి— "నాకేవో భయంగా ఉంది. ఈ ప్రక్కనే ఎవరివైనా ఇల్లుంటే, అక్కడికి చేరుకోవడం మంచిది" అన్నది, మెల్లగా.

విశ్వనాధరావు ఆమె భయం చూచి, మెత్తగా నవ్వాడు.

"భయ మెందుకూ నీకు— ఊఁ.... నే నుండగా నీకు భయమెందుకు చెప్పు...." అన్నాడు.

ఒక్క క్షణం నిశ్శబ్దం వహించి, "క్రొవ్వత్తి వెలిగించండి...." అన్నదామె.

విశ్వనాధరావు క్రొవ్వత్తి కోసం వెదికాడు. అది చేతి కందినట్లే అంది, జారిపోయి, క్రింద నీటిలో పడి బుడుంగు మంది.

"ఇది నాతో వేళాకోళమాడి, క్రిందకు జారింది" అన్నాడు, దగ్గరున్న టార్చికోసం వెదుకుతూ.

టార్చిలైట్ వెలుగులో క్రిందకు చూస్తే— ఏముంది?— అంతా నీరు. ఆ నీటిలో క్రొవ్వత్తి దొరకడం కష్టం.

కల్పన నీరసంగా నవ్వింది. నవ్వి, అన్నది గద— "నాకు చాలా సరదాగా ఉన్నట్లుంది...."

"ఒళ్లు గగుర్పొడుస్తోంది. పిచ్చి ఉత్సాహం కలుగుతోంది." అన్నాడతను.

కప్పలు బెకబెక లాడుతున్నాయి. వాన తల్లి పెళ్లికి బాకా లూదుతున్నాయి కాబోలు! కోటలో సవ్వడి.



తిరిగే రీలులా విపరీతించింది విశ్వనాథరావుకు. ఆ కణ్ణం కల్పనకు వినిపించకుండా— కూనిరాగంతో ప్రారంభించి, గగ్గయ్యలా పన్నాయి పట్టాడు. రాగధార రంజుగా ప్రవహిస్తున్నది. రాగం సాగుతున్నదే కాని, మనసేమో కోటలోనే ఉంది. నీల బ్రతికే ఉన్నదా ? లేక నీల తాలూకు ఆత్మ ఈ కోటలో తిరుగాడుతున్నదా ? ఒకసారి నీలను గాని, నీల ఆత్మను గాని చూస్తే.... వెర్రి ఉత్సాహంతో విశ్వనాథరావు లోలోపల కేరింతలు కొట్టుకున్నాడు.

ఉన్నట్టుండి విశ్వనాథరావు రాగాలాపన ఆపి, జేబులు తడుముకుని—"అరె! నా పర్సు ఏమైంది ?" అన్నాడు.

కల్పన కంగారుగా చూచింది అతని వంక.

"సరిగ్గా చూడండి— ఏమవుతుంది ?" అన్నది.

అతను జేబులన్నీ వెదకి— "లేదు కల్పనా ! ఏమైందో అర్థం గాకుండా ఉంది" అన్నాడు ఆలోచిస్తూ.

"కారులో మరచిపోయారేమో !"

చిక్కు ప్రశ్నకు సమాధానం లభించినట్లు—

"అవునవును. కారులోనే మరచి పోయి ఉండవచ్చు. అన్నట్టు, కారు బయటే ఉంది. చెట్లేమైనా కూలి పడతాయేమో ఏమో.... ఇక్కడకు తీసుకు వస్తే బాగుండేది." అన్నాడతను.

"ఇక్కడి కెట్లా ?— ఈ సీను...."

"అయితే— బయట వాకిలిలో పెట్టినా బాగుంటుంది. ఒక్క పది నిమిషాల్లో కారు క్షేమంగా ఇక్కడికి తీసుకువస్తాను— నువ్వు అనుమతిస్తే..."

విశ్వనాథరావువంక కల్పన అయోమయంగా చూచింది. అతను ఆమె చేతికి టార్చ్ లైట్ అందిస్తూ— "కారులో మరో టార్చ్ ఉంది. ఇది నీ దగ్గర ఉంచుకో— కొంచెమైనా భయం వద్దు. పదంటే పదినిమిషాల్లో నీ దగ్గరకు తిరిగి వస్తాను. కారుకు లాక్ చేయలేదు గనుక— పర్సు సంగతి భయంగా ఉంది. లేకపోతే— అసలు.... ఈ రాణీ వారిని ఒంటరిగా విడిచి వెళ్ళేవాడినా ? మహారాణీ

# కల్పన

వారు నన్ను క్షమించాలి—" అన్నాడతను.

కల్పన ఒకవైపు భయపడుతూనే— మరోవైపు విశ్వనాథరావు మాటలకు నవ్వింది. అతను లేచి, షరాయి మోకాళ్ళ వరకూ మడచుకున్నాడు. ఒకసారి కల్పన వంక నవ్వుతూ చూచి ప్రక్కనే ఉన్న రాళ్ళ మీదుగా బయటికి నడిచాడు. వర్షం నీరు దాదాపు రాళ్ళను కనబడకుండా చేస్తున్నది. కాలితోనే దారి తడుముకుంటూ, ఆ చీకటిలో విశ్వనాథరావు కారు వరకూ వచ్చాడు. నిజానికి అతని జేబులో పర్సు ఉండనే ఉన్నది. కారు డోర్ తెరచి, బ్యాటరీ లైట్ తీసుకున్నాడు. తిరిగి డోర్ మూసి, ఒకసారి గర్వంగా నవ్వుకున్నాడు. అతనికేమో చెప్ప లేనంత సంతోషంగా ఉన్నది. సహజంగా సాహస కార్యాల యెడల తనకున్న ఆసక్తికి అనువైన అవకాశం దొరికింది. కన్ను పొడుచుకున్నా కనిపించని ఈ చీకటిలో, ఈ నిశ్శబ్దంలో, మనుష్యమాత్రుడన్న వాడెవడూ ఈ సమయాన లోపలికి ప్రవేశించడానికి భయపడే స్థితిలో— తను నవ్వుతూ ధైర్యంగా 'నీల' కోసం కోటలో అడుగు పెడుతున్నాడు. తన ధైర్యం తనకే గర్వకారణంగా ఉంది.

ఈ విధంగా ఆలోచన చేస్తూ, అతను అటు వేపు నుంచి కోటలోపలికి వెళ్లడానికి వేగంగా నడవసాగాడు. ఎడమ చేతి వేపున ఒక వంద గజాలు నడిచాక, అక్కడంతా జిల్లేడు చెట్లు అలముకుని ఉన్నాయి. కోట గోడ దాదాపు అక్కడ దాదాపు కూలి పోయింది. ఆ శిథిలాల మీద నుంచి విశ్వనాథరావు లోపలికి ప్రవేశించాడు.

అక్కడ ఒక చిన్న గది. పిచ్చి పిచ్చి మొక్కలతో, ఎత్తుగా పెరిగిన గడ్డితో భయంకరంగా ఉంది. ఆ అల్లిబిల్లి మొక్కల మాటున పాములే కాదు చిరుత పులులైనా కాపురం చేయవచ్చు. కుళ్ళిన ఆకుల వాసన గుమ్మెత్తగా అతన్ని చుట్టు ముట్టింది. విశ్వనాథరావు ముక్కు మూసుకుని, పది గజాలు ముందుకు నడిచాడు. అక్కడ నడవడానికి ఆ ప్రక్క కాని బాటలేమీ, ఉన్నది దారి అతన్ని నడిపించుకు పోయింది.

సగం కూలిన గోడలతో, త్రుప్పు పట్టిన దర్వాజలతో, చివికి పోయిన గుడ్డలతో, విరిగిన పుల్లలతో నాలుగైదు ఇటికలతో నానా గందరగోళంగా ఉన్న ఒక గదిలో నిలబడి అతను ఆ గోడలను, గోడల మూలలను, పైన ఆకాశాన్ని చూచాడు. లైట్ నాలుగు మూలలా ప్రసరించింది.

ఒక మూల— మిణుకు మిణుకు మంటూ— నల్లగా— ఏమిటది ! మనిషి కళ్ళవలె— బావురు పిల్లి దొంగకళ్ళలా. లైట్ ఆర్పి, మళ్లీ వెలిగించాడతను. మరింత ప్రకాశమానంగా— నల్లగా— చుట్టగా— కాంతిలో బుస్సున తలెత్తి....

పకపక నవ్వి, "పాము...." అన్నాడు విశ్వనాథరావు, బిగ్గరగా.

ఆ సమయంలో అతన్ని, పాములు కాదు— చిరుత పులులు గాదు— సింహాలైనా అవరోధించలేవు. ఆ కోటలో నీల ప్రేతాత్మ తిరుగుతూ ఉంది. అది నిజమని నమ్మడానికి నీలను అతను చూడాలి. అంతే ! అంతవరకూ, అతన్ని పట్టి ఆపగల శక్తి దేనికీ లేదు.

ఆ నాలుగు గోడల మధ్య నుంచి, ఒక అడుగు ముందుకు వేసి, విశాలమైన మైదానంలోకి వచ్చాడతను. బ్యాటరీ లైట్ వెలుగు దూరంగా ప్రవహించింది. ఆలోచిస్తూ చూస్తే ప్రస్తుతం తను చూచిన భవనానికి, కోటకు చాలా దూరం ఉన్నదని పించింది విశ్వనాథరావుకు. దాదాపు నూటయాభై గజాల దూరం నడిస్తేనే గాని ఆ కోట రాలేదు. కోటకు మూడంతస్తులున్న జాడ. శిథిలావస్థలోనూ బాగానే కనిపిస్తూ ఉంది. పై అంతస్తు నామకార్థమైనా లేదు గాని— రెండవ అంతస్తు అక్కడక్కడ బాగానే ఉంది. ముందు తాను కూర్చున్న సింహద్వారం ఇక్కడికి కుడి చేతివైపున నూరు గజాల దూరంలో ఉండవచ్చును అనుకున్నాడతను.

సాహస కార్యాల యెడ మక్కువ అందరికీ సహజమే గాని అంతటి స్థైర్యం అందరికీ అలవడదు. కటిక చీకటిలో, గాలివాన రాత్రి, అంతకు మున్నెన్నడు చూడని నిర్జనమైన కోటలో— ప్రేతాత్మగా తిరుగాడుతున్న నీల కోసం ఎవ్వరు గాని వ్యర్థ ప్రయత్నం చేయబోరు. అందునా, కల్పన ఒంటరిగా బయట కూర్చుని ఉన్నది.

విశ్వనాథరావు నిలబడి చెవులు రిక్కించి విన్నాడు. ఘల్‌ఘల్ గజ్జెల సవ్వడి— తనకు చాలా దగ్గరగా— తన ముందు నుండే వెళుతున్నట్లు— అతను లైట్ వెలిగించకుండానే కళ్ళింత చేసుకుని చూచాడు. చీకటి మరింత నల్లగా కనిపించింది తప్ప మరేమీ కనిపించలేదు. గజ్జెల సవ్వడి గబగబ ముందుకు పరుగెత్తింది. దూరంగా వెళ్ళి, కుడివేపుకు మళ్ళింది.

ఒక్క క్షణం అతను గజ్జెల సవ్వడిని అనుసరించి, నీలను, నీలపడకను వూహలో నిలుపుకున్నాడు. నీల బ్రతికి ఉండక పోయినా, ప్రేతాత్మకూ నీల రూపమే ఉండాలని అతని భావన. నీల— సహజ [illegible] వర్ణం గలది. ముద్దుకైన చక్కని

46 వ పేజీ చూడండి



# చిన్న స్వెటర్

**చిన్న స్వెటర్ :**

ఇది చిన్న పిల్లలకి వాడుకోవచ్చు. పొడుగు సుమారు ఒకటిన్నర అడుగు, రొమ్ము కొలత సుమారు 28 అంగుళాలు ఉంటాయి.

**కావలసిన వస్తువులు :**

3—ప్లయి మురుదు ఎరుపు రంగు ఉన్ని—4 అవున్సులు.

బూడిదరంగు ఉన్ని—చిన్న ఉండ.

నెం. 10 నీడిల్స్—ఒక జత.

నెం. 12 నీడిల్స్—ఒక జత.

**చేసేపద్ధతి :**

పొడుగు, 18 అం. రొమ్ము 28 అం., 1 అంగుళానికి ఏడున్నర స్టిచ్‌లు ఉంటాయి—ఈ మూడు విషయాలూ గుర్తుంచుకోవాలి.

**వీపు**—నెం. 12. నీడిల్స్‌తో ఎర్ర ఉన్ని వాడి 90 స్టిచ్‌లు వేసుకోవాలి.

ని. 1, ప. 1, రిబ్, కలిపి 1 స్టిచ్ (చివరి వరస) చొప్పున 3 అంగుళాల మేరకి అల్లుకోవాలి. (91 స్టిచ్‌లన్నమాట.)

నెం. 10 నీడిల్స్‌కి మార్చుకుని పాటర్న్.

మొదటి వరస—* ని 2, (ని.1,ప.1) 4 సార్లు, ని. 3;* నుంచి చివరిదాకా తిరిగి చెయ్యాలి.

ఈ రెండు వరసలూ పాటర్న్‌కి ఆధారం. ఇదే పాటర్న్‌ని, తర్వాత వరసా, 6 వ వరసా 1 స్టిచ్ కలిపి 105 స్టిచ్‌లు వచ్చేదాకా వేసుకుని అదనపు స్టిచ్‌లని స్టిచ్‌స్టిచ్ చొప్పున, మోస్ స్టిచ్ చొప్పున వేసుకోవాలి.

అల్లిక పదకుండున్నర అంగుళాలు అయ్యేదాకా పని చేసుకుని 'రాంగ్‌సైడ్'లో ఒక వరసతో ముగిపెట్టు చూడాలి.

**చేతులు**—చేతులు దూర్చే ద్వారాలని ఈ విధంగా చెయ్యాలి. తర్వాతి రెండు వరసల ప్రారంభంలో 5 స్టిచ్‌లని కాస్టాఫ్ చెయ్యాలి.

తర్వాత 8 వరసల చివరల ఒక స్టిచ్ 'తగ్గించాలి' (డిక్రీజ్). 79 స్టిచ్‌లన్నమాట.

'షేపింగ్' లేకుండా అల్లిక 18 అంగుళాలు వచ్చేదాకా పని చేసుకుంటూ 'రాంగ్‌సైడ్' ఒక వరస రావటంతో ఆపాలి.

**భుజాలు :**

**మొదటి వరస**—7 స్టి. కాస్టాఫ్, పాటర్న్ 17, కుడిసూదిమీద ఉన్న స్టి. తోబాటు, 2 'కలిపి' (టుగెదర్) ని, తిరగవెయ్యాలి.

**రెండవ వరస**—ని. 2 'కలిపి' (టుగెదర్), పాటర్న్ 7.

**మూడవ వరస**—7 స్టి. లు. కాస్టాఫ్, పాటర్న్ 8, ని. 2 'కలిపి' (టుగెదర్.)

**నాల్గవ వరస**—ని. 2 కలిపి, (టుగెదర్) పాటర్న్ 7. మిగిలిన 8 స్టి. లు. కాస్టాఫ్.

ఉన్నివి సూది మొనమీద చేర్చి, మధ్య 27 స్టి. లు కాస్టాఫ్, చివరిదాకా పాటర్న్.

భుజం 'షేపింగ్' మొదటి వరసనుంచి తిరిగి చేసుకోవాలి.

**ముందు భాగం**—చేతులు పెట్టే ద్వారాల దాకా వీపుకి చేసుకున్నట్లే పని చేసుకోవాలి. (79 స్టి)

**తర్వాత వరస** — పాటర్న్ 31, తిరగవేసి, తక్కిన స్టి. లు మరొక సూదిమీద ఉంచాలి.

31 స్టి. లు చేసి, 1 స్టి. చొప్పున మెడ దగ్గిర తర్వాతి వరసకీ, 4 వ వరసకీ తగ్గిస్తూ, 22 స్టి. లు అయ్యేదాకా పని చేసుకోవాలి.

'షేపింగ్' లేకుండా 18 అంగుళాలు అల్లిక అయ్యేదాకా పని చేసుకుంటూ చెయ్యి దూర్చే ద్వారం అంచు దగ్గిర ఆగాలి.

**భుజం :**

**మొదటి వరస**—7 స్టి. పాటర్న్‌తో కాస్టాఫ్ చెయ్యాలి.

**రెండవ వరస**—చివరిదాకా పాటర్న్. చివరి 2 వరసలు తిరిగి వెయ్యాలి. మిగిలిన 8 స్టి. లు కాస్టాఫ్ చెయ్యాలి.

మధ్యఉన్న 17 స్టి. లు ఒక సేఫ్టీ పిన్ను మీదకి మార్చాలి.

ఉన్నిని మిగిలిన 31 స్టి. లకి కలిపి పాటర్న్‌తో చివరిదాకా పని చేసుకోవాలి.

మొదటి వైపుకి సరిపోయేట్లు పని చేసుకోవాలి.

సేఫ్టీ పిన్నుమీద 4 స్టి. లు నెం. 10 సూది మీదకి మార్చి, బూడిదరంగు ఉన్ని వాడుతూ, స్టి. స్టి. చొప్పున 9½ అంగుళాలు (లేక కావలసినంత) వీపువైపు మెడకి మధ్యదాకా చేసుకోవాలి—అంటే కొంచెం సాగదీస్తే, గ్రాఫ్టింగ్‌కోసం ఉంచుకోవాలి.

తర్వాత తక్కిన 4 స్టి. స్టి. లకి పని చేసుకోవాలి. మొదటి 'పట్టా' కి కలపాలి.

మొదటి 5 మోస్ స్టి. లని నెం. 10 సూదికి మార్చి మోస్ స్టి. లతోనే ఎర్ర ఉన్నిని వాడి 'పట్టా' 9½ అంగుళాలు అయ్యేదాకా పని చేసుకోవాలి.

ఇక 4 స్టి. లు మిగులుతాయి. మొదటి మెడ మధ్య నిట్ చేసుకోవాలి. (మోస్ స్టి. 4.)

ఈ 5 స్టి. లు మోస్—స్టి. చొప్పున ఎర్ర ఉన్ని వాడుతూ 'పట్టా' 9½ అంగుళాలు కానివ్వాలి మొదటి పట్టాతో కలపాలి.

**చేతుల అంచులు**—(2) నెం. 12 సూదులతో బూడిదరంగు ఉన్నితో 7 స్టి. లు కాస్టాన్ వెయ్యాలి.

స్టి. స్టి. చొప్పున 'పట్టా' కావలసినంత పొడుగు అయినతర్వాత (చేతులకి అంచుకి సరిపోయేదాకా) పని చేసుకోవాలి. కొంచెం బిగువుగా ఉంటే మంచిది.

కాస్టాన్ చెయ్యాలి.

**ముగింపు :**

అల్లికని వేడి ఇస్త్రీ పెట్టెతో తడి గుడ్డమీద అద్దాలి.

భుజాలు కలిసేచోట్లని (సీమ్‌లు) బాక్‌స్టిచ్ చెయ్యాలి.

స్టి. స్టి. మెడ బార్డర్లని మెడ అంచు చుట్టూ కుట్టాలి. మెడ వెనుక భాగం 'జాయిన్'కి ఉండాలి తర్వాత మోస్‌స్టి, బార్డర్‌ని స్టి. స్టి. బార్డర్‌కి కుట్టాలి 'జాయిన్'లు సరిపోవాలి.

చేతుల ద్వారాల అంచులు చుట్టూ అమరేట్లు కుట్టాలి. పట్టాని వెనక్కి మడిచి, అంచుమీద స్లిప్ స్టిచ్‌తో జతకెయ్యాలి.

పక్కల 'సీమ్' లని కలపాలి.

అన్ని 'సీమ్'లని నొక్కి, సరిచేసుకోవాలి.

పి. ఇందుమతి ★

మనోళ్ళంతే!

లత

## వనితావాణి

### ఎదిగే పిల్లల సమస్య

ఎదిగీ ఎదగని పిల్లలని అదుపులో పెట్టటం గురించి "విశాఖ"గారు వ్రాసిన "ఎదిగే పిల్లల సమస్య" అన్న వ్యాసం నన్ను ఆకర్షించింది. రచయిత్రికి నా అభివందనములు.

రేణు (కత్రాస్)

* * *

విశాఖగారు "ఎదిగే పిల్లల సమస్య" అను తమ వ్యాసమునందు తమకు మొగపిల్లలపైగల దురభిప్రాయమును వ్యక్తపరిచినారు అనుటలో సందేహములేదు. మొగపిల్లలకు గుంపులుగాచేరి ఆడవారి గురించి ఇష్టమొచ్చినట్లు మాట్లాడడం తప్ప వేరే పని ఏమీ లేదా! మొగపిల్లలలో వివిధ రంగములలో రాణించే మొగవారి కీర్తిని నలుమూలల వ్యాపింపజేసినవారు లేరా?

సోము (మద్రాసు)

* * *

"ఎదిగే పిల్లల సమస్య" వ్యాసం నా కెంతో నచ్చింది. రచయిత్రిగారు యదార్థికముగా ఈ వ్యాసము వ్రాసితిరి. ఆమెకు నా ధన్యవాదములు.

ఈ వ్యాసము చదివి అయినా ఈ కాలపు ఎదిగే పిల్లలు సక్రమమైన పద్ధతిలో నడుచుకుంటారనిని, తల్లి, తండ్రులు కూడా ఆమె వ్రాసినట్లే కొన్ని చిన్నచిన్న విషయములలో పిల్లల విషయములు పట్టించుకోరని ఆశిస్తూయున్నాను.

బి. ఎస్. కుమారి (బొబ్బిలి)

### సోవియట్ రష్యాలో స్త్రీలు

"సోవియట్ రష్యాలో స్త్రీలు" అన్న వ్యాసం చాల బాగుంది. స్త్రీలు పురుషులతోబాటు సమానత్వాన్ని సాధించాలన్న, సమాజంలో ముందంజ వేయాలన్నవారికి ఆర్థిక స్వాతంత్ర్యము ఎంత అవసరమో ఈ వ్యాసం చాటుతోంది. అది సాధించాలంటే ఒక్క సోషలిస్టు వ్యవస్థలో తప్ప మరెక్కడా సాధ్యంకాదేమోనని నా అభిప్రాయం. ప్రపంచంలో ఎక్కడా సాధింపబడని పురోభివృద్ధిని ఈరోజు రష్యాలో స్త్రీలు సాధించారంటే దానికి కారణం అక్కడ ఏర్పడివున్న సోషలిస్టు వ్యవస్థ.

రెహనా రహమాన్ (హైదరబాదు)

### అవియల్

టి. భూమాదేవిగారు అవియల్‌కి ఉప్పు వేయకుండా ముక్కలన్నియు వేరు వేరుగా ఉడికించవలెనని వ్రాసిరి. కాని ఉప్పు వేసినచో ఉడుకును. ముక్కలన్నియు వేరు వేరుగా ఉడికించనక్కరలేదు. దానికి తగిన నీరుపోసి, ఉప్పువేసి మూతయుంచిన చాలును. మధ్య మధ్యలో 2, 3 సార్లు ముక్కలు కదపవలెను. మేము ఇట్లాగే చేసినాము. చాలా బాగా వచ్చినది. మంట ఎక్కువగా పెట్టకూడదు. నెమ్మదిమీద ఉడికించవలెను.

శ్రీమతి ఎమ్. పద్మాలక్ష్మి (హైదరాబాద్) ★

25 12-1964 శుక్రవారం నుండి
31-12-1964 గురువారం వరకు

**మేషం.**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు అడుగడుగునా ఏవో ఆటంకాలు వస్తూ ఉండడంవలన ఈవారం తగినంత అభివృద్ధిని సాధించడానికి అవకాశంలేదు. సామాన్య వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. తాత్కాలికావేశాలకు లొంగిపోం డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం వలన ముమ్ముందు ఇబ్బందులు కలుగుతాయి. కొంత శ్రమమీద ఉద్యోగంలో యథాతథ స్థితిని కాపాడుకొంటారు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండకపోవచ్చును. బంధువుల వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు వస్తాయి.

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతున్నా, కొంతమంది సన్నిహితులైన వ్యక్తులకు వ్యతిరేకంగా వ్యవహరించవలసిన పరిస్థితి ఏర్పడడంవలన ఈవారం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. భారీ ఎత్తునచేసే వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారితో పోటీవలన కొంత అనవసరమైన వ్యయం జరిగినా తుదకు విజయాన్ని సాధించగలరు. ఉద్యోగంలో పెద్ద మార్పులు ఏమీ రాకపోవచ్చును. ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉన్నా విశేషమైన అనుకూలత లభించదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది.

స్త్రీలకు—శుభమూలకంగా వ్యయం జరుగుతుంది. వారాంతంలో సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాల్లో ఆదాయం కొంచెం పెరిగినా, కొన్ని వ్యవహారాల్లో వ్యతిరేక వాతావరణం ఏర్పడగల సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించగలవు. మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటికంటే బాగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో ఆకస్మికంగా కొత్త సమస్యలు తలఎత్తవచ్చును. స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. స్త్రీ ముఖాలంగా కలహ ప్రసంగం లావచ్చున్నా, దైవ

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | రా | |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | చం, కు |
| ర | బు శు కే | | |

కార్యాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును.

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈవారం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. ఇంతవరకు కేవలం ఆశయాలుగా మీ ఊహాపథంలో ఉన్న విషయాలు కార్యరూపం ధరించడానికి అవకాశాలు ఏర్పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రముఖ వ్యక్తుల అండదండలు లభించడంవలన తగినంత అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో ఆదాయంతోపాటు హోదా కూడా పెరుగుతుంది. ఉద్యోగంలో మార్పులకోసం మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలుమాత్రం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు వారం మధ్యనుంచి అనుకూలంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈవారం మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోయినా, మొత్తంమీద వృత్తి వ్యాపారాలు అనుకూలంగానే ఉంటాయి. మీ స్వంత వ్యవహారాలమాట ఎలాగ ఉన్నా, ఇతరుల పనిమీద కొంత ప్రయాసను పొందుతారు. వృత్తిలో పోటీవారితో పోటీ తీవ్రం కాగల సూచనలున్నా అందువల్ల మీ కార్యక్రమాలకు భంగం కలగదు. ఉద్యోగంలో అధికారులతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోయి అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల హడావుడి అధికంగా ఉంటుంది. ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది. సాహిత్యరంగంలో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. శుభ కార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది.

**ఈవారం ధరలు**

జవరాల ధరలు నిలకడగా ఉంటాయి. వనసుధర పెరుగుతుంది. బెల్లం ధరలో మార్పులువచ్చి వారాంతానికి కొంచెం తగ్గవచ్చును. నూనె నువ్వుల ధరలు మందంగాఉండి వారం మధ్యలో పెరగవచ్చును. వస్త్రాల ధరలు పెరుగుతాయి.

**కన్య :**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈవారం వృత్తి వ్యాపారాల్లో అనవసరమైన ఆర్భాటం హడావుడితప్ప మీరు సాధించే అభివృద్ధి ఏమీ ఉండకపోవచ్చును. ఇంతవరకు మీకు సన్నిహితంగా ఉన్న వ్యక్తులే కొంతమంది మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నించడంవలన మీ వారెవరో, పైవారెవరో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి ఉద్యోగాల్లో కొంత శ్రమమీద యథాతథ స్థితిని నిలబెట్టుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందకపోవచ్చును. కోర్టు వ్యవహారాలుమాత్రం సంతృప్తికరంగా ఉంటాయి. వారం మధ్యలో అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు—ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకోని ఆటంకాలు రావచ్చును.

**తుల :**

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని వ్యవహారాల్లో అధికంగా వ్యయం చేయవలసిన పరిస్థితి ఏర్పడడంవలన ఆర్థికంగా ఇబ్బంది కలగగల సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. వ్యాపారంలో ముమ్ముందు మీకు ఉపయోగించగల సంఘటనలు జరగవచ్చును. ఉద్యోగంలో మీరు అందరినీ సంతృప్తిపరచడానికి ప్రయత్నం చేయడం వలన అనవసరమైన ప్రయాసకు గురి కాగలరు. సాహిత్య కళారంగాల్లో కృషిచేసేవారికి అనుకూలమైన సమయం. ఆరోగ్యం బాగా ఉంటుంది. కొంతమంది బంధువులు కాళ్ళమీదపడి వేళ్ళు కొరికే విధంగా ప్రవర్తిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానేఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :**

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీరు ఇదివరకు ఎంతో ప్రయత్నం చేసినా, ఏవో ఆటంకాలు రావడంవలన ఆగిపోయిన వ్యవహారాలు కూడా ఇప్పుడు ఫలించగల సూచనలు ఉన్నాయి. వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు చురుకుగా సాగడంవలన ఆదాయం పెరగడానికి అవకాశం

ఉంది. వృత్తిలో ముఖ్యమైన వ్యవహారాలను గురించి ప్రయోజనకరమైన చర్చలు జరుపుతారు. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలుకూడా లాభించవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు :— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబకార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి.

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

కార్యసాధనకోసము మీరు కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో వ్యవహరించడంవలన మీ మిత్రులే మిమ్మల్ని అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. వ్యాపారంలో ఇదివరకు మీరు జరిపిన వ్యవహారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడవచ్చును గాని మీకు నష్టం కలగదు. నూతనవ్యవహారాలు ప్రారంభించడానికిది సమయంకాదు. వృత్తిలో క్రమాభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో పూర్తి అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. ఆరోగ్యం అంత బాగా ఉండదు.

స్త్రీలకు— ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం తగదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అలంకారవస్తువులు కొంటారు.

### మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

వృత్తివ్యాపారాల్లో అధికమైన వ్యయ ప్రయాసలకు గురికాగల సూచనలున్నాయి. కానితగిన ప్రతిఫలం లభించడంవలన ఈవారం సంతృప్తి కరంగా ఉంటుంది. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. అధికారులవలన జరుగవలసిన పనులు పూర్తిగా నెరవేరేవరకూ నమ్మడానికి వీలులేదు. వృత్తిరీత్యాచేసే ప్రయాణాలు ఫలించవచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి యథాతథంగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో యేర్పడిన చికాకులు క్రమంగా తొలగిపోతాయి. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకురాని బాధ్యత పెరుగుతుంది. ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండదు. బంధువులతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి.

—

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)

వృత్తి వ్యాపారాల్లో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. పదిమందీ మీ మాటకు ఓహో అంటారు. మీకు అంతగా సంబంధంలేని వ్యవహారాల్లో కూడా శ్రమ పొందవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఆర్థిక వ్యవహారాలు వారంలో మొదటి భాగంలోకంటే రెండవ భాగంలో అనుకూలంగా ఉంటాయి. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ శక్తిసామర్థ్యాలు

# వారఫలాలు

అధికారులచేత గుర్తింపబడతాయి. కోర్టు వ్యవహారాలు మాత్రం అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండడం అవసరం.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

### మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)

క్షణం విశ్రాంతి లేకుండా మీరు ఎంతో కృషి చేస్తేనేగాని వృత్తి వ్యాపారాల్లో మీ వ్యవహారాన్ని సాధించలేరు. [illegible] వివాదాస్పదంగా ఉన్నా ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లో కూడా చికాకులు రావచ్చును. వ్యాపారంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. వృత్తిలో పెద్ద మార్పులు ఏమీ రాకపోవచ్చును. ఉద్యోగంలో మార్పులకోసం చేసే ప్రయత్నాలు ఫలించగల సూచనలులేవు. ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. రక్తసంబంధమైన అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగవచ్చును. సంతోషకరమైన వార్తలను వింటారు. ★

# జన్మదినఫలం

## డిశంబరు-25

ఈ సంవత్సరం అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయిగాని ఆర్థికంగా విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు మీకేకాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. మీకు అంతగా ఇష్టంలేకపోయినా కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వంవంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది. వృత్తిలో మీకంటే అధికులు కూడా మిమ్మల్ని గౌరవిస్తారు. ఉద్యోగంలో మీరు ఇదివరకు ప్రయత్నం చేసిన మార్పులు రావచ్చును. రావలసిన డబ్బుమీద ఆధారపడి భారీ వ్యవహారాలు తలపెట్టడంవలన తరువాత ఇబ్బందులకు గురికాగలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అప్పుడప్పుడు చికాకులు వస్తూ ఉంటాయి. దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## డిశంబరు-26

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అన్నీ నెరవేరుతూ ఉన్నా యేదో ఒక కారణంవలన ఎప్పుడూ మానసికాందోళన కలుగుతూ ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు కన్పించినా ఫలితం పూర్తిగా వచ్చేవరకూ నమ్మడం కష్టం. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు రాను రాను ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో తీవ్రమైన పోటీని ఎదుర్కొన్న తరువాత విజయాన్ని సాధించగలరు. ఉద్యోగంలో అధికారులు మీ ఎడల అనుకూలంగా ఉన్నా పోటీవారి అసూయకు గురికాగలరు. రాజకీయ వ్యవహారాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## డిశంబరు-27

వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉన్నా, కొంతమంది సన్నిహితులైన వ్యక్తులతో భేదాభిప్రాయాలు రావడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో అనుకూలమైన పరిణామాలు కలుగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా సంవత్సరం మధ్యలో రాణించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుందికాని మీ శక్తి సామర్థ్యాలను అధికారులు గుర్తిస్తారు. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలఎత్తవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో మెప్పుకురాని వ్యయ ప్రయాసలకు గురి కాగలరు. అలంకార వస్తువులు కొంటారు. విద్యార్థులు మొదటినుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

## డిశంబరు-28

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొన్ని అవాంఛనీయములైన పరిస్థితులు ఏర్పడినా మొత్తంమీద ఈ సంవత్సరం చాలా అనుకూలంగా ఉంటుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు లభిస్తాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు జరుగుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. మీరు ఇంతవరకు రాదనుకొన్న డబ్బు కూడా ఇప్పుడు చేతికి రాగల అవకాశం ఉంది. కోర్టు వ్యవహారాల్లో మీ వాదం గెలవడానికి అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. వైద్యులకు, రాజకీయ నాయకులకు మంచి సమయం.

# జన్మదినఫలం

## డిశంబరు-29

మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేక పోయినా, వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోవడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. మీరు ఎంత జాగ్రత్తగాఉన్నా కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరుగుతుంది. ఆదాయం మామూలుగానేఉన్నా ఎప్పుడూ ఏదో ఒకవిధంగా డబ్బు అందుతూ ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వృత్తిలో మీరు ఇదివరకు చేసిన కృషి ఫలించవచ్చును. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. సంతానానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. విద్యార్థులు కొంచెం శ్రమ మీద కృతార్థులు కాగలరు.

## డిశంబరు-30

ఈ సంవత్సరం ప్రతి వ్యవహారంలోను ఏదో ఒక సందేహం కలుగుతూ ఉండడంవలన సాహసించి ఏ పని చేయలేరుకాని ప్రయత్నించిన ప్రతి వ్యవహారమూ నెరవేరడానికి అవకాశం ఉంది. అధికారులవలన జరుగవలసిన పనులు స్నేహితుల సహకారంవలన సులువుగా నెరవేరుతాయి. వ్యాపారంలో ముమ్మందు బాగా యోగించుటకు అవసరమైన మార్పులు జరుగుతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో స్థానచలము కలగవచ్చును. వ్యాపారం భారీ ఎత్తున చేయడంవలన ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడి పాటు కలగవచ్చును. సంవత్సరంలో రెండవభాగం చాలా అనుకూలంగా ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉన్నా మానసికాందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## డిశంబరు-31

వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఈ సంవత్సరం ఫలించగల సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొద్ది చికాకులు కలిగినా, మిత్రుల సహకారంవలన వాటిని అధిగమించడమే కాకుండా తగినంత అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో కొన్ని నూతనావకాశాలు ఇంద్రధనుస్సువలె ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. ఉద్యోగంలో పెద్ద మార్పులు ఏమీ రాకపోవచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ప్రేమ వ్యవహారాలు ఉత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. నటీ నటులకు వస్త్ర వ్యాపారులకు యోగవంతమైన సమయం.






(గత సంచిక తరువాయి)

పూజారి గర్భగుడి తలుపులు మూసి "పద నాయనా!" అంటూ సింహాద్రితో కలిసి బయటకువచ్చి సింహద్వారం మూసివేశాడు. సింహాద్రి పూజారి ప్రక్కనే నడుస్తున్నాడు. అతని కళ్ళలో దీపాలు. అతని మనసులో ఉడిగి. పూజారి, దేవాలయం ప్రక్కనేవున్న తన కుటీరంలోకి వెళ్ళి తాళం చెవులు భద్రపరిచి మళ్ళీ బయటకు వచ్చాడు.

ఇంకా సింహాద్రి అక్కడే ఉన్నాడు.

"ఎవరు నాయనా నువ్వు?"

"దాహం కావాలి తాతా!"

"లోపలకురా నాయనా." పూజారి లోపలకు వెళ్ళాడు. సింహాద్రి లోపలకు వచ్చాడు. ఎదురుగా చూస్తే రాములవారి పటం. వెనగ్గా ఆలయం తాళం చెవులు. లోపలకు వెళ్ళిన పూజారి ఇంతట్లో బయటికి వస్తాడా? సింహాద్రికి గోపాలస్వామి విగ్రహం నిల్చింది కళ్ళముందు. విగ్రహమంతా బంగారపు తొడుగే. సింహాద్రి పిరికిగాలేచి నిలబడి, భయంగా ముందుకు అడుగువేసి, వణకుతున్న చేతులతో తాళం చెవులు తీసుకుని బొడ్లో దోపుకుని లాల్చీ సరి చేసుకుని ధైర్యంగా తిరిగి వచ్చి సంతృప్తితో యధాస్థానంలో కూచున్నాడు.

పూజారి మజ్జిగ పోసి గ్లాసులో తీసుకుని ఇంత భగవత్ప్రసాదం పళ్ళెంలో పెట్టుకుని తీసుకు వచ్చాడు.

"తీసుకో బాబూ!"

సింహాద్రికి అతన్ని చూసి నమస్కారం చేయా లనిపించింది. "మీకు పిల్లలున్నారా తాతా?"

పూజారి అడ్డంగా తల వూపాడు. "ఇప్పుడు కాదు." వాతావరణం గాలి వేస్తున్న చప్పుళ్ళతో వింతగా ధ్వనిస్తోంది. "ఒకడు దొంగ, మరొకడు అప్రయోజకుడు. దొంగను నేనే ఇంట్లోనుంచి తరిమేశాను. ఆ అప్రయోజకుడు భార్యాదాసుడై నన్నే ఇంట్లోనుంచి తరిమేశాడు. ఇప్పుడా వేణు గోపాలుడే తల్లీ తండ్రీ కొడుకూ కూతురూ సమస్తమూ."

సింహాద్రి ప్రసాదం పుచ్చుకుని మజ్జిగ తాగి "వస్తాను తాతా!" అన్నాడు లేచి నిలబడుతూ.

"జాగర్త నాయనా! అమాయకుడిలా ఉన్నావ్"

పూజారి కంఠస్వరం వెనకనుంచి బుజ్జగిస్తోంది. సింహాద్రి రోడ్డుమీదకువచ్చి మళ్ళీ దేవాలయం దగ్గరకు వెళ్ళాడు. పూజారి ఇంట్లో దీప కాంతి తగ్గడం అతనికి కన్పిస్తోంది. వూరు మాటు మణుగుతోంది. సందు నిద్రపోతోంది.

సింహాద్రి తొందర తొందరగా దేవాలయం తలుపులు తెరచి, తను లోపల దూరి మళ్ళీ తలుపులు మూశాడు.

విశాలమైన దేవాలయం. ఒంటరిగా ఉన్న భయం తెలియని సింహాద్రికి భయం వేసింది.

గుండెలు చిక్కబట్టుకుంటూ ముందుకు నడిచాడు. తలుపు కన్నాలలోంచి లోపల బందీగా వున్న గోపాలస్వామి కనబడుతున్నాడు. ఇంకా అతడు నిద్ర పోలేదులా ఉంది. కళ్ళు మెరుస్తున్నాయి.

సింహాద్రి పిరికి పిరికిగా గర్భగుడి తలుపులు తెరిచాడు. కీచుమంటున్న శబ్దం. అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. గబగబా ప్రక్కకు తప్పుకున్నాడు. మళ్ళీ నిశ్శబ్దం. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విన్పించేటంతటి నిశ్శబ్దం. సింహాద్రి స్వామికి ఎదురుగా నిలబడ్డాడు.

దేవుడు మానవుణ్ణి చూసి నవ్వుతున్నాడు. మానవుడు దేవుణ్ణి చూసి భయపడుతున్నాడు.

సింహాద్రి చేతులు వణుకుతున్నాయి. లోపల పాములా మెలికలు తిరుగుతున్న కోర్కె గిట్టారస్ప రూపాన బుస కొడుతోంది. స్వామి వంటిమీద చెయ్యి వేశాడు సింహాద్రి. రాతిదేవుడు మాట్లాడ లేదు.

సింహాద్రి గుండెలు చిక్కబట్టుకుని ఒక్కొక్క అలంకారమే వొల్చి క్రింద పెట్టాడు. నేలమీద ఉన్న బంగారపు నగలు మెరిసిపోతున్నాయి. నగ ల్లేని దేవుడు, దేవుడిలా కనబడడంలేదు. రత్నాల కన్నుల్లేక దేవుడు గుడ్డివాడై పోయాడు. సింహాద్రి ధైర్యంగా నగల నన్నింటినీ మఫ్లర్లో మూట కట్టుకుని, వెనుతిరిగి చూడకుండా బయ

తీసివచ్చి, బయటి తలుపులు మాత్రం దగ్గరకు వేసి, తాళంచెవ్వు గడప ప్రక్కన పడవేశాడు.

ఇహమీదట ఏం చేయాలి ?

నగలతో ఉన్న సింహాద్రికి దేవుడి భయం పోయి, కొన్ని క్రొత్తరకాల భయాలు పట్టుకున్నాయి. 'తను తొందరగా ఆ బంగారాన్ని డబ్బుగా మార్చుకోవాలి. ఎట్లా ?' అన్నదే అతని తాపత్రయమైంది. కొంతసేపటి క్రితం వరకూ మనుష్యులకోసం వెతికిన సింహాద్రి ఇప్పుడు మనుష్యుల నుండి పారిపోదా మనుకుంటున్నాడు. 'బంగారాన్ని ఖరీదుచేసే ఒక్క పెద్దమనిషి దొరికితే చాలును !' అతని కింకేమీ అక్కరలేదు.

సింహాద్రి తనకు జ్ఞాపకమున్న వ్యక్తుల నందర్నీ తల్చుకున్నాడు. అందరూ సమాజపు అట్టడుగు పొరల్లో జీవిస్తున్నవాళ్ళు ! డబ్బు కంట పడితే చాలు, పిచ్చికుక్కలై పీకేవాళ్ళు ! ''ఊహూ, వాళ్ళ లాభంలేదు. ఇంకా కొంచెం అంతస్తు ఉన్న వాళ్ళు కావాలి. బంగారపు వ్యాపారం చేసేవాళ్ళు, పాపిష్ఠి బంగారం నగలు చేసేవాళ్ళు—అవును—అటువంటివాళ్ళే కావాలి.''

సింహాద్రికి వీరభద్రాచారి జ్ఞాపకం వచ్చాడు. నగలమూటను జాగ్రత్తగా చంకన పెట్టుకుని సందులూ, గొందులూ తిరిగి అతని ఇంటికి వెళ్ళాడు సింహాద్రి. ఆతని ఇళ్ళు తాళం వేయబడి ఉంది. ఎవరో సాధువులు ఆ ఇంటి అరుగులమీద నిద్ర రాక అటూ ఇటూ దొర్లుతూ పదాలు పాడుకొంటున్నారు.

సింహాద్రిని చూడగానే ''నల్లనయ్య రక్షిస్తాడు. ధర్మంచెయ్ తండ్రీ.'' అన్నాడు వాళ్ళలో ఒకడు లేచి కూచుంటూ.

సింహాద్రి క్రీనీడలో నుంచుని అడిగాడు. ''ఈ ఇంటాయన ఎక్కడికి వెళ్ళాడు ?''

''మాకు తెలీదు.'' మరో మూల నుంచి కర్కశంగా సమాధానం వినిపించింది.

సింహాద్రి ఇహ నక్కడ నుంచోలేదు. దానం చెయ్యలేదు. నగలమూటను పట్టుకుని రోడ్డు మీదకు వచ్చాడు. డబ్బు .... డబ్బు .... డబ్బు కావాలి. సీతాలు కళ్ళముందు మెదల్తోంది. డబ్బు కావాలి. డబ్బుంటేనే మందులు. మందులు లేకపోతే సీతాలు బతకదు. మందులు .... మందులు.... సింహాద్రి అడుగులు తడబడ్డాయి. తూలి పడబోయి లైటు స్తంభం పట్టుకుని నిలద్రొక్కుకుని ఎదురుగా చూచాడు. ఒకే ఒక మెడికల్‌షాప్, ఎడారిలో ఒయాసిస్సులా, సముద్ర మధ్యాన ఉన్న వాడికి లైటుహౌస్‌లా, కన్పించింది.''

మెడికల్‌షాప్ ఆసామీ కౌంటర్ ముందు కూచుని తూగుతున్నాడు. సింహాద్రి ఆ కొట్టు ముందు కాసేపు తటపటాయించాడు. నగరంలో ఇంకేకొట్టూ తెరిచి ఉండదు. మందు కావాలి. సీతాలు బ్రతకాలి. ఓ నిశ్చయానికి వచ్చి అతన్ని నిద్రలేపాడు.

''ఇవిగో ఈ గొట్టా లున్నాయా ?''

విసుగ్గా నిద్రలేచిన కొట్టుగలాయన బేరగాణ్ణి చూసి మందహాసం తెచ్చుకున్నాడు. చీటి తీసుకు పరిశీలించి ''ఇవా ?—ఆఁ ! ఉన్నాయ్ ! పన్నెండు రూపాయలీ.'' సింహాద్రి మాట్లాడలేదు. ఆసామీకి అనుమానం వేసింది.

''ఏం, డబ్బులున్నాయా ?'' అన్నాడు మొహం గంటుపెట్టుకుంటూ.

''లేవు.'' సింహాద్రి నిర్భయంగా చెప్పాడు.

''అయితే ఎందుకూ ఇక్కడ ? వెళ్ళు. వెళ్ళు. ఇదేం ధర్మసత్రంకాదు. మందులషాపు.''

''కోప్పడకయ్యా !— డబ్బుల్లేవు. బంగార మిస్తాను.''

ఆసామీ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారాయి. ''బంగారమా ?'' అన్నాడు ఆ మాటమీద వత్తిపలుకుతూ.

''అవును. ఇదిగో'' అంటూ కడియాన్ని నొకదాన్ని తీసి బయట పెట్టాడు సింహాద్రి. ట్యూబు లైటు కాంతిలో కడియం లోభపెట్టేట్లు మెరుస్తోంది. షావుకారు దానివైపు పరకాయించి చూశాడు. సింహాద్రివైపు చూశాడు. బంగారం మెరవడం చూశాడు. సింహాద్రి మూటను గట్టిగా పట్టుకోవడం చూశాడు. అతని కన్నులు కొద్దిగా ముకుళించుకున్నాయి.

''ఉండు. మందిస్తాను. ఇట్రా. ఇక్కడ కూర్చో.''

సింహాద్రి లోపలకు అడుగు వేశాడు. ఆయన టెలిఫోన్ ఎత్తబోయాడు. సింహాద్రికి అతని నీచబుద్ధి అర్థమైంది.

''తనను, తనను పట్టిస్తున్నాడు వాడు. తను పట్టుబడకూడదు. సీతాలుకు జ్వరం. అది బతకాలి.''

కడియం చేతిలోకి తీసుకోబోయాడు సింహాద్రి. కాని షావుకారు అప్పటికే ముందుజాగ్రత్తపడి, కడియం తన చేతిలోకి తీసుకోవడంతో చేసేదిలేక, అక్కడ ఉండనూ లేక పరుగెత్తి పారిపోబోయాడు.

పరుగెత్తి పారిపోతున్న సింహాద్రిని చూచి రోడ్డుమీది కుక్కలు అరుస్తున్నాయి. గాలి సుళ్ళు తిరుగుతూ నవ్వుతోంది. వగరుస్తూ లోపలకు వచ్చిన భర్తను చూచి, బుడిగి కంగారుపడుతూ ''పోలీసులా ?'' అన్నది, తలుపు వేయటానికి లేవబోతూ.

''కాదు. నగలు.''

బుడిగికి అర్థంకాలేదు. ''అంటే ?''

''దేవుడి గుళ్ళోవి. గోపాలస్వామివి.'' మూట విప్పుతూ అన్నాడు సింహాద్రి.

''దేవుడివా ?'' పణికిపోయింది బుడిగి. ''దేవుడి సొమ్ము తిన్నవాళ్ళెవళ్ళూ బాగుపళ్ళేదు. వొద్దు మావా !''

నగలను ఒక్కటొక్కటే పేర్చి చూస్తున్న సింహాద్రి, అర్థంకాక భార్యవైపు చూశాడు.

''మనిషి సొమ్ము మనిషి తినొచ్చు మావా? దేముడి సొమ్ము మాత్రం మనిషి తినకూడదు.''

ఉండి ఉండి సీతాలు అటూ ఇటూ దొర్లుతోంది. జ్వరానికి ఆగలేక బిగ్గరగా మూలుగుతోంది. మధ్యమధ్యలో కలవరిస్తోంది. ''నాన్నా ! నే దొంగను కాన్నాన్నా ! నాన్నా, నే దొంగను కాన్నాన్నా ! మా నాన్న నెందుకు పట్టుకున్నరూ? —వదిలిపెట్టండి. నాన్నా ! అమ్మా ! అమ్మా ! నువ్వయినా చెప్పవే.''

బుడిగి పిల్ల తలను వళ్ళోకి తీసుకుంది. సీతాలు మొహం నల్లరంగుకు మారుతోంది. పెదవులు ఎండి పగుళ్ళు బారుతున్నాయి. శరీరం ఉష్ణగుండంలా ఉంది.

''మావా ! వెళ్ళు. దేవుడి సొమ్ము దేవుడికే ఇచ్చెయ్ ! అట్టా చెయ్ మావా !'' బుడిగి కంఠం దీనంగా ఉంది.

సీతాలు వళ్ళు చల్లదనానికి తిరుగుతోంది. వేళ్ళు వంకర్లు పోతున్నాయి. ఉన్నట్టుండి సీతాలు కళ్ళు తెరిచింది. సింహాద్రిని చూసి ''నాన్నా !'' అంటూ సంతోషంతో లేవబోయింది. లేవలేక తల క్రిందికి వాల్చేసింది.

''అమ్మా ! సీతాలూ—వచ్చావే, నగలట్టుకొచ్చా, నువ్వెట్టుకుంటావని, నా అమ్మలు లచ్చిందేవిలా ఉంటుందని, ఇదిగోవే, ఇటు — ఈ కడియం...'' సింహాద్రి కంఠం రుద్ధమైంది.

సీతాలు బలంలేని గాజుకళ్ళని ప్రక్కకు త్రిప్పలేక త్రిప్పింది. ఆ నగలను చూసి ముందుగా ఎంతో సంతోషపడింది. చేతితో స్పర్శించి ఆనందించబోయింది. మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చి చెయ్యి వెనక్కు తీసుకుంది.

''ఇవ్వెక్కడివి ?'' నూతిలో నుండి మాట విన్పిస్తోంది. సింహాద్రి సమాధానం చెప్పలేదు.

''ఎత్తుకొచ్చావ్ కదూ ?'' ఆ తండ్రి తల వాల్చుకున్నాడు.

''ఇవి ఆ గోపాలస్వామి నగలు. కాదూ ?'' ఆలుమగ లిద్దరూ ఆశ్చర్యంతో ఒకటయ్యారు.

''నే నెన్నోసార్లు ఆ గుడికి వెళ్ళాను.'' సింహాద్రి కూతురువైపు చూడలేకపోతున్నాడు. సీతాలు కళ్ళ నుండి సంతతధారగా నీళ్ళు కారిపోతున్నవి. ''మా నాన్న దొంగ. దొంగ కూతుర్ని నేను.'' చేతులు కొట్టుకొంటున్న సీతాల్లో వాడి బలహీనపడుతోంది.

సీతాలు స్థితి చూసి, భర్తను కుదుపుతూ అన్నది బుడిగి. ''వెళ్ళు మావా ! ఆ నగలా దేముడికిచ్చి రెండు లెంపలూ వాయించుకో. ఇంకెప్పుడూ ఈపని సేసని ఒట్టేసుకో. పిల్లదాన్ని వాక్కుతో సెప్పాడా దేవుడు. దానికి తెలివి ఇందుకే వచ్చింది.''

సింహాద్రికి లీలగా అంతరాంతరాళాలలో ఏదో అనుమానం వేసింది. దేముడి సంగతి ఎట్లా ఉన్నా, తను అంతకుక్రితమే ఓ పిల్లదానికి నూకలు లేకుండా చేశాడు. ఆ పుసురు తగల్లేదు కదా ?

''ఆలోచనేటి మావా ? పిల్లదాని పేణం సూడు. దానికన్నా బంగార మెక్కువా నీకు ?''

సింహాద్రి లేచి నుంచున్నాడు. అతనిలో సమస్యలనేకం మారాకులేస్తున్నాయి. గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ వెనక్కు వచ్చి, భార్యతో అన్నాడు. ''ఇదిగో పిల్లదానిమీద ఒట్టేసి సెప్తున్నా ! దానికోసం దొంగతనం మానేస్తున్నా.''

బుడిగికి అర్థంకాలేదు. ఆ మాట. ''ఎందుకూ ?'' అన్నది. అని, ''రేపటి సంగతి సరే. ఇవ్వాల్టి సంగతి సూడు. ముందా నగలు దేవుడి కిచ్చేసి లెంప లేసుకో.'' అన్నది మందలింపుగా.

సింహాద్రి సమాధానం చెప్పకుండా ఆ నగల మూటను తీసుకుని, అష్టవంకర్లుగా, తన జీవితంలా ఉన్న సందులగుండా నడుచుకుంటూ గోపాలస్వామి ఆలయం దగ్గరకు చేరుకున్నాడు.

ప్రకృతి ప్రశాంతంగా పుణ్యస్త్రీలా కన్పిస్తున్నది. వెన్నెలపైనుండి వర్షంలా పడుతున్నది. ఇళ్ళల్లో పిడలు నిద్రపోతున్నాయి.

పూజారి ఇంటివైపు చూశాడు సింహాద్రి. అది నిమ్మకు నీరెత్తినట్టుగా ఉంది. దేవాలయం గడపదగ్గర తను వదిలేసిన తాళం చెవుల కోసం చూశాడు. ఇంకా అవి అక్కడే ఉన్నాయి. "ఓహ్! ప్రపంచమంతా దొంగలమయం కాదన్నమాట! పెట్టిన వస్తువు పెట్టినచోట ఉంటున్నది. అందులో ఎంత భరోసా ఉన్నది!"

వాటిని తీసుకుని, తలుపులుతీసి, లోపలకు ప్రవేశించాడు. ప్రవేశిస్తుంటే ఈసారి భయం వెయ్యలేదు. సంతోషంగా ఉంది. గర్భగుడి తలుపులు తీయగానే, గోపాలస్వామి నవ్వుతున్నట్లు కనిపిస్తున్నాడు. సింహాద్రిస్వామి ముందు, మోకాళ్ల మీద కూచున్నాడు. "తండ్రీ!" అన్నాడు. చేతులు జోడించి. "ఇంక నే దొంగతనం చెయ్యను. మా అమ్మల్ని కాపాడు. ఇదిగో నీ నగలు, ఒక్క కడియం మాత్రం—అవును సామీ—అది అడు కొట్టేసినాడు, నన్ను మోసం చేసినాడు—నాను తప్పుసేయలేదు. నీకు అంతా తెలుసు. నన్ను రచ్చించు సామీ!"

సింహాద్రి హృదయం సంతోష తరంగ సంభరిత మైంది. అతనికి తను శుచి అయినానన్న భావన కలుగుతోంది. ఆ నగలన్నీ గోపాలస్వామికి అలంకరించా లనిపిస్తోంది. వెనక్కు చూశాడు. ఎవ్వరూ లేరు.

సింహాద్రి, బంగారు మురళిని స్వామి హస్తాల మధ్య పదిలపరిచాడు. హారాలు నల్లనయ్య మెడలో వేశాడు. పీతాంబరం మొలకు చుట్టి, మామిడి పిందెల మొలతాడు దానిపై అలంకరించాడు. ఆతర్వాత తలయెత్తి కన్నులపండువుగా స్వామి నిజ దర్శనం చేసుకున్నాడు. "ఎంత అందంగా ఉన్నావు సామీ! నీ నగలు దొంగిలించాను" అనుకున్నాడు లెంపలు వేసుకుంటూ. ఆ తర్వాత వంగి, పాదానికి కడియం వెయ్యబోయాడు.

వెనగ్గా చప్పుడు.

మోకాళ్లమీదకు వంగి ఉన్న సింహాద్రికి అలంకరిస్తున్న చేతుల క్రిందగా కళ్లను ధనుస్సులుచేసి వెనక్కు చూశాడు. మనుషులు పురుగుల్లాగా, పుట్టగొడుగుల్లాగా, ఆశల రూపాల్లాగా, నల్లగా కోపంగా, పాపంగా కన్పించారు. హఠాత్తుగా లేచి నుంచున్నాడు.

"పట్టుకోండి. పట్టుకోండి. దొంగ. దొంగ. దేముడి సొమ్ములు దొంగిలిస్తున్నాడు. వెధవ నిక్కంద్రల్."

సింహాద్రి తలఎత్తి చూశాడు. ఆ కళ్లల్లో ఆకలీ, కోపమూ కన్పించాయి జనంలో అతన్ని తిట్టినవాడికి. సింహాద్రికి తనను తిట్టిన ఆ పెద్ద మనిషి మొహం పరిచయమైనదిగా కన్పించింది.

జనం కర్రలతో, రాళ్లతో ముందుకు వస్తున్నారు. వెనకనుంచి పూజారి మాటలు బాధగా విన్పించాయి.

"నువ్వా!—అయ్యో, ఎందుకు చేశావిపని?"

సింహాద్రి, పూజారిని చూసి జవాబు చెప్పటానికి తడబడ్డాడు.

పూజారి, గోపాలస్వామి వేపు చూశాడు, "ఏమిటి స్వామీ? ఇదంతా!" అన్నట్లు. పూజారి దృష్టి

# జైలు

స్వామి పింఛముపైనుండి వక్షస్సు వైపుకు, వక్షస్సుపై నుండి కటిమీదకు, కటిపైనుండి పాదాగ్రములపైకి మరలింది. పాదాలను చూసి ఆయన కంగారుపడ్డాడు. ఒక పాదానికి మాత్రమే కడియం ఉన్నది!

పూజారి ఉచ్చైస్వరంతో అన్నాడు. "స్వామి రెండవ పాదానికి కడియం లేదు."

జనమంతా 'కడియం, కడియం' అని అరవడం మొదలెట్టారు. ఆ అరుస్తున్నవాళ్లల్లో మరింత పెద్దగా అరుస్తున్న పెద్దమనిషివైపు చూశాడు సింహాద్రి. ఆ మొహం అతనికి మెల్ల మెల్లగా జ్ఞాపకం వచ్చింది. ఆ మొహం 'తన దగ్గరి నుంచి కడియం దొంగిలించిన మెడికల్‌షాపు యజమాని!'

సింహాద్రి కళ్లు కోపంతో ఎర్రబడ్డాయి. పిడికిలి బిగించి, లేచి నుంచుంటూ, "నేను కాదు ఆ కడియం దొంగిలించింది" అంటూ అరిచాడు పెద్దగా.

"దైవసాన్నిధ్యంలో అబద్ధం చెప్పకు నాయనా!" వెనకనుంచి పూజారి స్వరం బాధగా ధ్వనించింది. "ఆ కడియం అక్కడ పెట్టు."

"నా దగ్గర లేదు. అదుగో ఆయన దగ్గరుంది—ఆ మందుల కొట్టాయన దగ్గర." చూపులతో, వేళ్లతో నిర్దేశించాడు సింహాద్రి.

"అ.... బ.... ద్ధం...." మెడికల్‌షాప్ యజమాని వణికిపోయాడు. అది కోపంతో అనుకున్నారు జనం.

"నే.... నేను.... గౌరవంతో బ్రతికేవాణ్ణి."

"అవును!" జనత వంతబలికింది.

"నామీద వీడికి కోపం." "కాదూ ?!" జనత తలూపింది.

"...మండు తిమ్మన్నాడు. ... దబ్బారిమ్మన్నను. ఇస్తానని ఇట్టా వచ్చాడు. అప్పుడే అనుమానం వేసింది. వేసీ, వాడివెంట ఇట్లా వచ్చాను. అందుకని...." "నిజం. నిజం. నిజం. నీవు చెప్పిందే నిజం. వాడే దొంగ" జనం సముద్రంలా రొద చేసింది. 'దొంగ' అన్న పేరుతో ఆలయం ప్రతిధ్వనిస్తోంది. "దొంగతనం చెడ్డది నాయనా!" పూజారి జాలిగా అంటున్నాడు.

"నాను దొంగని కాను.... నాను దొంగను కాను." సింహాద్రి గింజుకుంటూ అరిచాడు.

"కాకపోతే దొరవా?"

"అవును. దొర్నే. మీరూ నిజంగా దొంగలు." ఆ మాటతో ఇరవై చేతులు పైకి లేచాయి. పది కర్రలు సింహాద్రి తలమీద పడ్డాయి. "దేవుడా! తప్పు సేసినాడు నన్నువ్వు రచ్చించలేదు. మనిషిగా మారినప్పుడు నన్ను సిన్నసూపు సూత్తున్నావ్. ఇదేటి నాయం!?" అనుకుంటూ స్వామి పాదాల దగ్గర సింహాద్రి పడిపోయాడు. పడిపోతున్న వాడికి బుడిగి ఏడుస్తూ కళ్లల్లో మెదిలింది. సీతాలు కళ్లల్లో ప్రాణంలేక కనబడింది.

తెలివి వచ్చి కోర్టులో జడ్జిగారి దగ్గర బోనులో నిల్చున్న సింహాద్రికి, మెడికల్‌షాపు యజమాని తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడం కన్పించింది. "పెద్దమనిషి సాక్ష్యం!" హేళనంగా, జీవన సత్యం తెలుసుకున్నవాడిలా నవ్వాడు సింహాద్రి. ఆ నవ్వును అంగీకారంగా తీసుకుని రెండున్నర నెలలు కఠిన శిక్ష విధించాడు న్యాయాధిపతి. శిక్షపడి మళ్లీ సెంట్రల్ జైలులోకి వస్తున్న సింహాద్రిని చూస్తూ అన్నాడు వార్డరు.

"మొన్నేకదూ్రటా నువ్ వెళ్లింది?"

"అవును. మొన్ననే జైలులోకి వెళ్లాను. ఇవ్వాళే విడుదలై వచ్చాను." అన్నాడు సింహాద్రి సీతాలును తల్చుకుంటూ, బుడిగి నిగూర్చి బాధపడుతూ, లోకంమీద కసితో. 



**కొత్త సీరియల్ ప్రారంభం!**

# సంపెంగలూ సన్నజాజులూ

**అవసరాల రామకృష్ణారావు**




'వసుధ మధుజల్లు మానవ వనము నందు
కొన్ని విలువైన విరులైన కోసి తెచ్చి
నీదు పాదాల ముంగిట నిలిపి తేని
ధన్యమైనట్లు జననము తలతు దేవ!'

ఆ సాయంకాలపు నీరెండలో కూచుని నాకిష్టమైన పైపద్యం పదే పదే చదువుకుని పరవశించి పోతున్నాను.

ఏమిటో! అలా ఆలోచిస్తూంటే నామనసు ఏళ్లకొద్దీ వెనక్కి వెళ్లిపోతుంది. కలిగిన సందిగ్ధాలూ-నాలో జరిగినసంచలనాలూ నిన్నా మొన్నా జరిగినట్టు అనిపిస్తోంది. నిజానికి నా మనోవ్యధలకి కారకులు దుర్మార్గులెవరూ కాదు పైగా నాకు కావలసిన వాళ్లంతా పువ్వులంత సున్నిత హృదయులు. కాని ఎన్ని రకాల సుమాలో అన్ని రకాల సువాసనలు. అందుకనే నా గడిచిన దశాబ్ద చరితం పలువిధ పరిమళభరితం. అర్థమైన వాళ్లు ఆఘ్రాణించ గలుగుతే అంతకన్న ఆనంద మేముంది!

నా పదిహేనవ ఏట నేను ఫిఫ్త్‌ఫారం చదువుతూండగా మానాన్న చదువు మానిపించేస్తానన్నారు. నేనే కాదు, నాతోపాటు అన్నయ్యకూడా నాన్నగారితో హోరాహోరీ వాదించాడు.

'దాన్ని చదువు మానిపించి పెళ్లిచేద్దామని ఎందుకంత తొందర పడతారు? ఇప్పుడేమంత వయసు మించి పోయిందని? కళ్లూ మనస్సూవిప్పి దాన్ని లోకాన్నంతా చూసుకోనివ్వండి. ఎప్పుడు తగిన సంబంధం వస్తే అప్పుడే మానిపించెయ్యవచ్చు. అవతలి వాళ్ల కిష్టముంటే అలా చదివించినా తప్పులేదు. అదికి ముందు మానిపించెయ్యడం దేనికి?'

వాడు నాకంటే అయిదేళ్లు పెద్ద. మాయిద్దరి మధ్య పిల్లపుట్టి పోయిందట. నాకు ఏడది ఉన్నప్పుడు మాయిద్దరినీ వదిలి అమ్మ పోయిందట. మాయిద్దరికీ మధ్య నాన్నెప్పుడూ రానూలేదు, మేము రానిచ్చిందీలేదు!

'చదివిస్తూ కూచుంటే ఏదో జరిగిపోతుందిగదా అని సంబంధాలు వెతకడం అలా అలా ఆలస్యమై పోతుంది. పిల్ల ఇంట్లో ఉన్నదారి వేరు. మన కళ్లఎదురుగా కనబడుతూ ఉంటే........''

'...కంట్లో నలకలా గరగరలాడుతూంటుంది కాబోలు ఎప్పుడుతీసి అవతల పారేద్దామా అని పిస్తూంటుంది కాబోలు. తెల్లారగట్లే లేచి ఇంట్లో పనులన్నీ వేళ పట్టున చేసి దానిమట్టుకది బడికి వెళ్లొస్తూంటే మీకేం అడ్డొచ్చింది?'

'ఒరే దాని సంగతి ఆబాధ్యతా నాది కాని నీదికాదు. నిన్నెవడు సలహా ఇమ్మన్నాడు.?' అని నాన్నగారు కోపంగా, విసురుగా అక్కనుంచి వెళ్లిపోయారు. అన్నయ్యతో అన్నాను,

'మామూలు మాటకే నాన్నముందు జడిసేవాడివి, ఇవాళ నీకింత ధైర్యం ఎలా వచ్చిందిరా అన్నయ్యా?'

'లేకపోతే ఏమిటే ఒళ్లు మండిపోతూంటే...... అన్నట్టు ఒసే మంజూ, ఈనెలాఖరులోగా నీజీతం ఫైన్‌తో పుచ్చుకుంటారుగదూ, నాదగ్గర సొమ్ముంది కట్టేసి వస్తానుండు. నాన్న ఏం చేస్తారో?'

నాన్న ఆ ప్రక్కనే ఉండి మామాటలు వింటున్నడని మానౌకరు అప్పన్న చేసిన సంజ్ఞను అన్నయ్య అందుకోలేదు. నాన్నగారు రుద్రాకారం దాల్చేరు.

'అలాగలాగే.... కట్టేసి వచ్చినా సరే, దీన్ని ఆ బడిలో గాటికి కట్టేసి వచ్చినా సరే.... ఇదెలా చదువుతుందో నేనూ చూస్తాను. ముందుగా హెడ్మాస్టరుతో మాట్లాడి అన్ని కాగితాలూ అప్పుడే పట్టుకొచ్చేశాను. గార్డియన్ సంతకం లేకుండా నువ్వేం చెయ్యగలవో నేనూ చూస్తాను'

అన్నయ్య విసురుగా అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. నాన్నగారు నా వైపు మింగినట్టు చూస్తూ పెరట్లోకి వెళ్లి పోయారు. చిన్నప్పట్నుంచీ మమ్మల్ని ఆడించి పెంచిన మా అప్పన్న నేనూ అక్కడ మిగిలేం.

'అయినా ఆనమ్మాయిగోరూ.... ఆ పెద్ద సేనానికి ఎతిరేకంగా తమరికి మాత్తరం అంతగా సదువు మీద బెమ ఎందుకండి? సదువుకుని డాట్టమ్మవుతారా, బరిస్టారా?'

నేను జవాబు చెప్పలేదు. చెప్పలేను కూడా. పక్క గదిలోకి వెళ్లి పడకుర్చీ మీదకూలబడ్డాను. అంతులేని విద్యనేర్చి అపారమైన మానవసేవ చేద్దామనే ఆలోచన నాకెప్పుడూ లేదు గాని ఏదో చెప్పలేని పిపాసా, వివరించలేని తహతహా అజా

జ్ఞానములన్నీ ఒకటి ఒకటే మెట్లమీద ఎక్కినట్టు ఎక్కి ఆ చివర నిలబడి కింద ఎలా ఉంటుందో చూడాలనే పిచ్చి ఆ రోజుల్లో మరీ ఎక్కువగా ఉండేది. చదువుమీద నాకు ఇంతగా గురి కుదరడానికి —ఇంట్లో అన్నయ్యతో పాటు— మాకు ధర్మవరంలో ఇంగ్లీషు చెప్పే సుందరమ్మగారు కూడా కొంత వరకు కారకురాలనుకుంటాను. అంత చిన్నతనంలోనే ఇంగ్లీషు సారస్వతం మీద విశేషమైన అభిమానం కలిగేలా చేసిందామె. డికెన్సు నవలల మీదా, మిల్టన్ పద్యాల మీదా ఆ రోజుల్లో అంత నిశ్చితమైన అభిప్రాయం ఏర్పడక పోయినా అప్పుడా పేర్లయినా తెలీడం కనీసావసరమేమో అని ఇప్పుడనిపిస్తూ ఉంటుంది. పాఠం ఆటలా చెప్పే ఆమె సామర్థ్యం అందరికీ రాదనుకొంటాను. ఒకసారి ఆమె మరికో ఆటోగ్రాఫ్ రాసిస్తూంటే చూశాను.

'చదువు చదువు చదువు
చదువు కల్ల తరువు'

ఈ అక్షరాలు 'సిరాక్షరాలు' కావు. నా మనస్సులో చెరగని శిలాక్షరాలు. నాన్న మానిపించేసినా ఇంకా ఎలాగైనా ప్రైవేటుగా కట్టించాలని అన్నయ్య ప్రయత్నిస్తూనే ఉండేవాడు. ఈ ఇద్దరు అభిమానవ్యక్తుల మధ్య పడి నేను నలిగి పోయేదాన్ని. చదువుకోలేక పోయానన్న వ్యధకన్న ఆప్తుల అభిప్రాయ భేదాలకు కారకురాల్నయాను గదా అనే చింత నన్నెక్కువ పీడించేది. కాని కాలపురుషుడు చేసే పరిష్కారాలు వూహాతీతంగా ఉంటాయి.

'ఒరే, నీతో మాటాడాలి ఇలారా' అన్నారు నాన్న ఒక రోజు అన్నయ్యతో. నేను గదిలో జడ అల్లుకుంటున్న దాన్ని గుండెలు కొట్టుకుంటుండగా ఇవతలికొచ్చాను. నాన్న ఎప్పుడో గాని అలాపిలవరు.

'చూడూ, దీనికి పదిహేనూ వెళ్లిపోతున్నాయి,'

'.... అంటే పదహారూ వస్తాయన్నమాట.'

'అంత వేళాకోళంగా ఉందన్నమాట. బాధ్యత ఎరగని పసిగుడ్డువు, నీతో నాకేం గాని, నే చెప్పేది జాగ్రత్తగా విను. ఎంత ప్రయత్నం చేసినా కనీసం మూడువేలయినా ఇస్తేగాని సంబంధం కుదిరేలా లేదు. పై ఖర్చులు ఎలా లేదన్నా ఓ వెయ్యి రూపాయల దాకా అవుతాయి.'

అన్నయ్య ఏదో అందామనుకున్నట్టున్నాడు. కాని నాన్న మొహంలో విషాద మేఘాలు చూసి ఆగి పోయి ఉండాలి.

'నేనూ ఆడపిల్లని కన్నవాణ్నే, కన్యలతో పాటు కట్నాలు కూడా ఇచ్చి పంపడం ఎంత కష్టమో నేను వూహించగలను. కాని ఏం చెయ్యను ? సత్యనారాయణగారి అమ్మాయి అలివేలు మంగమ్మని నువ్వు చూశావ్ లేదో, తెల్లగా బాగానే ఉంటుంది. అతనూ లేనివాడేగాని ఈ మధ్యనే ప్రావిడెంటు ఫండు అయిదువేలు వచ్చిందట. అలా నీకు కట్నంగా ఇచ్చేస్తానన్నాడు. దాంతో దీని పెళ్లయిపోగా చిల్లర అప్పులేవేనా ఉంటే తీరిపోతాయి కూడా. ఇదే నా ఆశ. నువ్వేనా ఆస్తి. కాదనకు బాబూ.'

నాన్న ఎంత నెమ్మదిగా బాధగా చెప్పేరో అన్నయ్య అంత త్వరగానూ కఠినంగానూ జవాబు చెప్పి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

'ఇప్పట్లో పెళ్లి చేసుకోవడం నా కిష్టం లేదు. చేసుకున్నా కాణీ కట్నం పుచ్చుకోడం నా కిష్టం లేదు. ఆ మాట మళ్లీ రెండోసారి మీ నుంచి వినడం నా కసలు ఇష్టంలేదు.'

ఈ మాటలే అన్నయ్య ఇంతకంటె సరసంగా చెప్పి ఉండవచ్చు. తనుఅన్నివిధాల చెప్పినా నా చదువు నాన్నగారు మానిపించెయ్యడమే వాడికి ఆయన పట్ల ఇంత దురభిప్రాయం కలిగించిందేమో! అయినా ఈ కాలపు ఆడపిల్లల చదువు గురించి నాన్నగారి అభిప్రాయాలుగూడా అంతగా తోసి పారెయ్య వలసినవి కావు మరి!

'ఒక ఉద్దేశమంటూ లేకుండా ప్రభుత్వం కనీస దృష్టితోచూసే విభిన్న విద్యా విధానంలో కొట్టుకుంటూ తేలికగా పైకి తేలిపోతున్న అర్భకులైన మొగాళ్ళే చాలు. మానదశానికి సరిపడని ఈ చదువులు మన మాతృమూర్తులకి మాత్రం ఎందుకు ? వివాహ రుచుల్ని తెచ్చిపెట్టే వయసులో ఉన్నవాళ్ళని ఇంట్లో ఉన్నా పైకి ఈడ్చి మానసికంగా చిత్రవధ చెయ్యడానికి చిత్రాలూ, చిత్రిక పట్టడానికి పత్రికలూ చాలు. క్రమశిక్షణ లేని గురువులుగల పాఠశాలల్లో చేరి ఆడపిల్లలు కూడా అన్యాయమై పోవడం దేనికి ?'

ఇంతటి ఘాటు విమర్శకి అన్నయ్యతోపాటు నేనూ అవునలేనుగాని నాన్నగారి అంతర్గతంలోని అసలు కారణం నేను ఊహించగలను. ఇలా ఏరోజు కారోజు గడిచిపోతే ఓ యేటికో యేడు మీదపడి ఆడపిల్లల పెళ్ళిళ్ళు వెనక బడిపోతాయని.

అన్నయ్య అలా జవాబు చెప్పడంతో నాన్నగారు మరీ క్రుంగి పోయా రనుకుంటాను. మొహమెత్తి నావైపు సరిగ్గా చూడడం మానివేశారు. నిద్రాభోజనాలవిషయంలోగూడా ఆయన చాలాఅశ్రద్ధ వహిస్తున్నట్లు అనిపించి నామనస్సు చివుక్కు మనేది. అసలే బడి మానెయ్యడంవల్ల ఏమీతోచేదికాదు. నాన్న చూస్తే రోజురోజుకీ నిరుత్సాహంగా నీరసంగా కనిపించేవారు. రోజులు దుర్భరంగా నిశ్శబ్దంగా గడిచేవి. ఒక్క అప్పన్నతోతప్ప మాతో మాటాడే వారేకాదు.

ఒకనాడు వాడు నాన్నకి కాళ్ళుపట్టడానికి వచ్చాడు.

'అదేమిటి పెద్దయ్యగారూ, అరిపాదాలు అంతనిప్పుగా ఉన్నాయేం ?' నాన్న వాడికేం జవాబు చెప్పలేదు. కొంచెం సేపు ఆగి అన్నారు.

'అప్పన్నా'

'ఏం పెద్దయ్యగోరూ,'

''పిల్లకి లోకజ్ఞానమన్నది లేదురా. ఎలా బతుకుతారో ఏమిటో నాకర్థం కావడంలేదు. నేను ఉంటానో ఉండనో. నువ్వేనా చివరిదాకా పిల్లని కనిపెట్టుకు ఉంటావా అప్పన్నా ?'

'ఏమిటి బాబూ ఇయ్యాల అలాసెలవిస్తున్నారు?' అంటూ వాడు వలవల ఏడ్చేశాడు. నాకూ కన్నీళ్ళు ఆగలేదు.



# సంపెంగలా...

"ఏం చెయ్యమంటావ్ ? ఎలా చూసినా నామనసు కుదుట పడటం లేదురా! మీ పెద్దమ్మగారు ఇంతింత పసిపిల్లల్ని నా కంఠానికి చుట్టబెట్టింది. ఎలా పెద్ద వాళ్లను చేశావో ఏంపెట్టి పెంచావో భగవంతుడికెరుక కాని వీళ్లు పెరిగారని నాకనిపించటంలేదు. ఉత్తి అమాయకులు. ఇంకా పసిపాపల పట్టుదలలు. వీళ్లని చూస్తే నాకేవిధమైన విభ్రమం కలగడంలేదురా అప్పన్నా! బీదరికం, వార్ధక్యం నావివేకాన్ని నశింపజేస్తున్నాయి. నారెండు కళ్లూ అనుకున్న నాపిల్లలే నామాట విననప్పుడు నాకింక ఈ ప్రపంచంలో మిగిలిందేమి టనిపిస్తోంది!"

ఈసారి నాన్నగారే ఏడ్చేశారు. వేణు వచ్చి దెబ్బ లాడినా ఆగలేదు.

ఆసాయంకాలం మలినమైన మనస్సుతో పెరట్లో మొల్లపందిరి దగ్గర నిలబడ్డాను. అంతకుముందే నాన్నగారి ఓంపరేచరు చూశాను. దీనికేదో వెంటనే చేస్తేగాని నాకేం తోచేలాకనబడలేదు. అడుగుల చప్పుడై ఇటు తిరిగిచూశాను. అప్పన్న. అన్నికోలు పోయి వట్టింది వాడి మొహం.

"అమ్మాయిగోరూ శానా పెప్పాల్సింది తమరితో — ఏం అనుకోరుగదా ?' నేనేంమాటాడలేను. చిత్రంగా వాడివైపు చూశాను. పొపుగంటసేపు ఏమిటో గొణుక్కున్నాడుగాని స్పష్టంగా ఒక్క ముక్క నోటంట రాలేదు.

'నాను తమరికేటి సెప్పగల్ను నా ఎర్రిగాని! నాన్న గార్ని మాత్రం రచ్చించు కోండితల్లీ ఆ పెనం శానా కట్టపడి పోతాంది!'

కళ్లనీళ్లు తుడుచుకుంటూ వెళ్లిపోయాడు. ఒక నిశ్చయానికి వెంటనే వచ్చేస్తేగాని నామనసు కుదుట బడ లేదు. ఆరాత్రి నాన్నగారికి కాస్తనిద్ర పట్టేక అన్నయ్య గదిలోకి వెళ్లేను. వాడేదో చదువుకుంటున్నాడు.

'ఏంరా, విన్నేమాటడగవా?' వాడు ఆశ్చర్యంతో ఇటు తిరిగేడు.

'నాకు ఓ చదువ లేదు. ఓ పెళ్ళా, లేదు. ఒకరి మీద ఒకరు పంతాలు వేసుకుని ఇలా వుంటదానిగా, ఒంటరిదానిగా ఎన్నాళ్ళు నా బ్రతుకు వృధా చెయ్య దల్చుకున్నారు?'

'ఇదినీకు పుట్టిన బుద్ధా, నాన్నగారి ఉపదేశమా?'

'అంతేనన్నమాట, అయితే ఇకచెప్పనులే' అని ఇవతలికి వచ్చేస్తూంటే 'చెల్లీ, చెల్లీ' అని నా వెంటబడి బలవంతాన నామొహంపట్టుకు పైకెత్తాడు.

'ఓ అమ్మ ఉందనా, అక్కఉందనా నీతోకాక మరెవరితో చెప్పుకోను?'' అన్నట్టున్న నా చూపులోని భావంవాడే చదవగలడనుకుంటూను నేనూ అప్పుడే వాడి మొహంలోకి చూశాను.

'చెల్లీ, పెళ్ళిచేసుకుని అత్తారింటికి వెళ్ళిపోదామనుకుంటున్నావా? నన్ను విడిచివెళ్ళడం నీకు సాధ్యమే ననుకుంటున్నావా ?' అన్నట్టున్న వాడిచూపులోని భావం నేనే చదువగల ననుకుంటూన్నాను. ఇద్దరం ఒకేసారి తలలు ఒంచుకు కన్నీళ్ళు తుడుచుకున్నాము.

అమ్మ కూడా లేకపోవడంచేత చిన్నప్పట్నుంచి మేమిద్దరం మరింత దగ్గరగా పెరిగేం. నేను ఆడ పిల్లలతో చింతపిక్కలాడుతూంటే తాటి ప్రమాణాన పిక్క ఎగరేసి పట్టుకుంటూ వాడూ మాతో ఆటకి తయారై పోయేవాడు. వాడు ఆవీధి మొగపిల్లలతో క్రికెట్ ఆడుతూంటె పరికిణీ గోచీపోసికట్టి, పెద్ద పేరక్కలా జడముడేసి నేనూ హాజరై పోయేదాన్ని. ఇక ఆట మొదలెట్టిందగ్గరనుంచి వాడూ నేనూ దెబ్బలాడుకోని క్షణముండదు. ఆటకి కూడా స్త్రీలింగమూ పుల్లింగమూ ఉంటని చెప్పడానికి మాకెవరూ లేరు. మాకెవరూలేరని మేమెప్పుడూ విచారించింది లేదు!

నేను వాడితో ఏంచెబుదామని అక్కడికి వచ్చానో జ్ఞాపకం చేసుకునే సరికి పదినిముషాలైనా పట్టి ఉంటుంది.

'నాన్నగారి మనస్సు అంతగా కష్టపెట్టే మనం సాధించేదిమాత్రం ఏమిట్రా అన్నా? నువ్వైనా నేనైనా పెళ్ళిచేసుకునే వయసు లేనంత చిన్నపిల్లలం ఏమీకాదు. ఈ దుఃఖంతో ఈయన ప్రాణంపోతే మనం బతికున్నన్నాళ్ళు ఏడ్వవలసి ఉంటుంది. ఆకటి కూటివళ్ళ ఆదర్శాలు ఎన్నాళ్ళు నిలుస్తాయి? నువ్వే ఆలోచించు'

అని ఇవతల కొచ్చేశాను. అంతకన్న ఏం మాట్లాడాలో నాకేం తోచలేదు. 'సంఘంలో నైతిక పరివర్తన కలగాలంటే సంఘాలూ, ప్రణాళికలూ, బిల్లులూ సాధించేది ఏమీ ఉండదు. ధనిక వర్గాల హృదయాలలో ఆపరివర్తన కలగాలి. క్రింది వర్గాల మీదకి ప్రసరించాలి. క్రింది మెట్లవాళ్లు ఎందరు బలియైనా అది ఎవరికీ కనబడదు, నిలబడదు' అని ఎక్కడో చదివినట్లు గుర్తు. కట్నాలు ఇవ్వకూడదనీ పుచ్చుకోకూడదని అన్నయ్యకూ నాకేకాదు నాన్నగారికీ ఉంది. కాని ఏం లాభం?

ఆరోజు తెల్లవారు ఝామునే మెలుకువవచ్చి నిద్రపట్టక లేచిపోయాను. నీరసంగా ఉన్నట్టు లేచి, మొహం కడుక్కొని, కాఫీ కలుపుకు తాగుతున్నాను. అన్నయ్య నాన్న గదిలోకి ఎప్పుడొచ్చాడో తెలీదు. 'సత్యన్నారాయణ గారి అమ్మాయి విషయంలో మీ ప్రయత్నాలు మీరు చేసుకోవచ్చు. నాకేం అభ్యంతరంలేదు' అనేసి వెళ్లి పోయాడు. నా నోట మాట రాలేదు.

అయిష్టంగా అవుననడం కన్న ఖచ్చితంగా కాదనడం మేలు. నాన్నగారు మాత్రం అనుకోని ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయారు.

'చూశావా అప్పన్న వీళ్లు కొంచెం లోతైన మనుష్యులా. మీ పెద్దమ్మగారూ అలాగే ఉండేది. నేనే తొందర పాటు మనిషిని. ఒసే నువ్వు ఎక్కడున్నావే.. మీ అన్నయ్య ఏమన్నాడో విన్నవుటే? మళ్లీ వర్జ్యాలు వస్తాయి కాబోలు ఇప్పుడే వెళ్లి



చ్చేస్తాను అన్నాను. ఆ చేతికర్ర కొంచెం అందుకో— కొంచెం పంచాంగం చూసి రావే మంజూ'

నేను లోపలికి వెళ్ళి పంచాంగం చూశాను. అసలు అప్పుడే అన్ని విధాలా దివ్యంగా ఉంది. కాని ఆయనప్పుడు వెళ్ళడం నా కిష్టంలేదు !

'ఇప్పుడేం బాగున్నట్టు లేదు నాన్నా, రేపు చూసుకో వచ్చులే'

'నీ మొహంలా ఉంది. ఏ తడికో ఏదో బాకీ ఏమిటో, ఏది ఆ పంచాంగమూ ఆ పుతోపనాలూ ఇలా అందుకో'

అయినా నేను ఓటమి అంగీకరించదలుచుకో లేదు.

'పంచాంగం ఎక్కడా కనబడదు నాన్నా ! అయినా నిన్న రాత్రి అంత జ్వరం కాసింది. ఇంకా పథ్యమైనా తీసుకోలేదు. ఇవాళకీ రేపటికీ ఏమంత కొంప మునిగేది ?' నాన్న ప్రశాంతంగా నన్ను చూశారు. ఏమనుకున్నారో ఏమో అప్పటికి మాత్రం ఊరుకున్నారు. ఆ రాత్రి మళ్ళీ అన్నయ్య గదిలోకి వెళ్ళాను.

'ప్రపంచంలో త్యాగాలూ దానాలూ చేసేవాళ్ళకి కీర్తి వస్తే రాగాక. అది గ్రహించే వాళ్ళకి ఎంత కష్టంగా ఉంటుందో, ఎంత నికృష్ట పరిస్థితుల్లో వాళ్ళు దానికి తయారు పడతారో కూడా కొంచెం

పూహించడం మంచిది.''

'ఎవరి మీద ఈ విసుర్లు ?'

'నువ్వు పోల్చుకోలేని వాళ్ల మీద మాత్రం కాదు' అన్నయ్య దగ్గరగా వెళ్లాను. మాటిగా మొహంలో మొహం పెట్టి చూస్తూ అన్నాను.

'ఎందుకురా అన్నా నన్నిలా బాధ పెడతావ్ ? నా పెళ్లి గురించి— నీ ఆదర్శాలకు విరుద్ధంగా నువ్వు కట్నం పుచ్చుకోడానికి సిద్ధ పడినందుకే నా తల తీసేసినట్టుంది. పిల్లనయినా చూడకుండా ఒప్పేసుకున్నావంటే నా మనసెంత కొట్టుకుంటుందో ఆలోచించావా ? నాన్నగారిది మూర్ఖత్వం పట్టు అంటావే, మరి నీది ?'

అన్నయ్య నా తలమీద చెయ్యి వేసి ప్రేమతో నిమిరేడు.

'చెల్లీ, ఒకప్పుడు మనం విసుక్కున్నాం.... జ్ఞాపకముందా, ఆ వాడు, నువ్వు నాకు జడవేసిన వాడు....'

ఓసారి వాడు నిద్ర పోతూండగా క్రాపింగు లోని ముందు పొడుగుపాటి వెంట్రుకలు తీసి, నెమ్మదిగా వాటితో వళ్లరిబ్బను జతచేసి పాయలు అల్లి జడవేశాను. 'సైసల్ టిబెట్' ఇద్దామని చిన్న డబ్బిడి చేమంతి పువ్వొకటి, అది కూడా గుచ్చేది, ఆ జడలో తురుము బోతూండగా వాడికి తెలివి వచ్చేసింది. నేను పారిపోతూంటే నా జడ పట్టుకున్నాడు.

'ఎంత అల్లరొచ్చిందే నీకూ ! ఉండు. నీ పని ఇలా కాదు... నిన్ను ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లూ తాగించే వాణ్ణి ముల్లోకాలూ వెతికేనా సరే తెచ్చి కట్టపెట్టక పోతే చూసుకో'

'ఓయబ్బో, నీ పెంకితనం ఎవరెరగరని ! నీ గుడ్ల కదలేసే దాన్ని గూబ మెలేసే దాన్ని గుడ్ల గూబ నేకదాన్ని కోళాలన్నీ గాలించైనా పట్టి గుమ్మంలో కట్టలేక పోతానటా ?'

పైకి విరసంగా ధ్వనించే ఈ సరసోక్తుల అంతరార్థం ఒకటే. 'మనిద్దరం ఒక రక్తం పంచుకు పుట్టిన వాళ్లం. ఒక ధర్మం నేర్చుకు పెరిగిన వాళ్లం. మనలో ఒకరికి వచ్చితే రెండో వాళ్లకి నచ్చినట్టే' అని ఆ మర్నాడు నాన్నగారితో పాటు నేనూ సత్యన్నారాయణగారి అమ్మాయిని చూసి వచ్చాను. రాగానే అన్నయ్యతో అన్నాను.

'మా చెల్లెమ్మకి నచ్చితే నాకు నచ్చినట్టే, నేను వేరే చూసుకో నక్కర్లేదు' అన్నావుటగా ? పిల్లేమో నాకు నచ్చింది. వాళ్లనింకా ఏడిపించట మెందుకుని తొందర్లోనే ముహూర్తం పెట్టించండని చెప్పి వచ్చేశాము. పెళ్లికూతురు పిల్లి కూతురులాంటిది ! తెల్లటి తెలుపేగాని చిరుమీసం ఉన్నట్టు అనుమానం. నిజం చెప్పాలంటే ఆ మీసం కట్టు ముందు ఆ మీసకట్టే తీసికట్టనుకో'

కళ్లలోకి నీళ్లు వచ్చేలా నవ్వేడు అన్నయ్య. నాన్న దెబ్బలాడేరు.

'ఏమిటే మంజూ మంచి చెడ్డా లేకుండా మరీ అంత మోటు హాస్యం. నువ్వేం నమ్మకొద్దే. పిల్ల దీపంలా ఉంటుందనుకో'

'దీపమయితే అక్కడే ఉండనియ్యండి, మనిల్లు అంటుకోగల్దు' అన్నాడు అన్నయ్య. ఈ సారి నాతోపాటు నాన్నగారు కూడా నవ్వేరు.

దేనికి కేదీ బంటి రంగారంగ తెల్లగా ఉంటుందో ఆ బుద్ధి అంత తెలుపు. ఆ మొహ మెంత నున్నగా ఉంటుందో ఆ నడత అంత నునుపు ఆ మని పెంకి నిండుగా ఉంటుందో ఆ మనసంత నిండు.

'మధ్య నా కేదో పెళ్లి చేసి ఉద్ధరిద్దామని, నా కట్నం కోసమని నీ ఇష్టానికి విరుద్ధంగా నువ్వు పెళ్లి చేసుకోడ మేమిటి, నీకు అన్ని విధాలా అనుకూల మైనది జత పడి పోవడ మేమిటి ? ఇదేం బాగులేదురా అన్నా నాకేమిచ్చుకుని నా కోపం తీర్చుకుంటావ్' అనే దాన్ని అన్నయ్యతో.

'అంత తొందర పడకే— ఆ రోజు రాకపోదు లేవే' అనేవాడు.

'ఏమయ్యోయ్, వెర్రిబాగుల పిల్లా ఏమిటో అనుకుంటున్నట్టున్నావ్ మీ వదిన కాపురాని కొచ్చినట్టుంది. జాగర్త ఇల్లంతా ఆక్రమించేను ! అని ముందుగానే హెచ్చరించింది అప్పుకొచ్చిన అప్పారావు లోకలే. ఆవిడ చెప్పింది కొంత వరకూ నిజమే. వదిన వంటిల్లు మాత్రం వదల్లేదు. కుందేలులా తెల్లగా ఉంటుంది కాబట్టి 'వంటింటి కుందేలు' అన్నా తప్పులేదు. ఆ మాట పైకన్నా ఆమెకు కోపం కూడా రాదు ! కాపురానికి వచ్చిన రెండో రోజు నుంచీ రాత్రి పూట తను వండుతానని కూచుంది మరో వారం రోజులకి పొద్దుటి పూట ఛార్జీ కూడా తనే తీసుకుంది. ఇంకో పల్లాళ్లకి కాఫీ కలపడం కూడా నేను మరచి పోయేటట్టు చేసింది ! నేను మంచినీళ్లు తాగుదామని ఆ వంటింటి గడప దగ్గిరకి వచ్చినా సరే ఒక్క కేకేసేది.

'ఏమండోయ్, ఇదిగో మీ మంజు చూడండి. వద్దంటూంటే ఎలా జొరబడుతుందో' మా అన్నయ్య వచ్చి నా చెవి పట్టుకునేవాడు.

'ఏమే, ఎన్నిసార్లు చెప్పేది నీకే వాయులకి రావద్దని, పోతావా, పోవా ?'

'ఏం ? నేనేం కులాసాగా ఉండడం మీ కిష్టం లేదా ? ఎంతసేపూ చేతో పుస్తకం పట్టుకుని ఆ పడక్కుర్చీలో దొర్లుతూంటే తిన్నది నాకేలా అరుగుతుందనుకున్నారు ? ఇప్పుడు మీరిలా పిడప చేసి నా నోటికి అందిస్తూంటే ఆడ కూతుర్ని గదా ఎల్లకాలం నా కెలా జరుగుతుందనుకున్నారు ? ఏమయినా సరే నేనివాళ వంటింట్లోంచి కద లను' అని కత్తిపీట ముందేసుకుని కూచున్నాను.

ఒకనాడు ఉల్లిపాయలు ముందేసుకుని 'ఓహో అంతవరకు వచ్చిందే, ఉండు నీ పని ఇలా కాదు, మంగళా, నీ చెయ్యి కడుక్కుని ముందిలారా'.

వదిన పమిటతో చేతులు తుడుచుకుంటూ నా దగ్గిరకి వచ్చింది.

'పట్టు, పట్టు, దీన్ని పాయం పట్టు'

ఇద్దరూ బలవంతాన నన్ను ఎత్తుకున్నంత పని చేసి వీధి గదిలో కూలేశారు. అన్నయ్య గది తలుపు గొళ్లెం వేస్తూ అన్నాడు :

'వంటయ్యాక తలుపు తీస్తుందిలే మీ వదిన, దుఃఖపడకు'

ప్రపంచంలో దేనికయినా విలువ కట్టవచ్చు. ఎలాంటి దైనా కొలవ వచ్చు. అభిమానం కొలవటానికి మారికానం.

కళ్లల్లో నీళ్లు తిరుగుతూండగా కిటికీ ఊచలు పట్టుకుని వీధివైపు చూస్తూ కూచున్నాను. అవతలింటి కిటికీలోంచి అదే పరిస్థితిలో ఆరేళ్ల

రంగనాధరావుగారు లేచి నిలబడ్డారు. అడుగులో అడుగు లేసుకుంటూవెళ్ళి కూజాలో నీళ్ళు గ్లాసులోకి ఒంపుకుని మొఖాం కొద్దిగా చల్లుకొని పై పంచతో నుతి మెత్తగా అద్దుకున్నారు. తర్వాత మిగిలిన కాసిని నీళ్ళనూ కిటికీలోనుండి వాకిట్లోకి విసిరి, మళ్ళా గ్లాసునిండా నింపుకొని గడగడా నోట్లో పోసుకుని త్రాగి 'అమ్మయ్య' అనుకున్నారు పెద్దభారం నెత్తిమీదనుండి దింపుకున్నట్లుగా.

ప్రతి నెలా అంతే. మొదటి తారీఖు వచ్చిందంటే ఆయనకు కొద్దిగా కష్టంగానే ఉంటుంది. ఆ స్కూల్లోవున్న ఇరవైమంది మాష్టర్లకు నలుగురు గుమాస్తాలకు, ఐదుగురు జవాన్లకు జీతాలు పంచాలి!......ఎక్కువ తక్కువలు రాకుండా జాగ్రత్తగా ఇచ్చేటప్పటికి ఒక పెద్ద భారం తీరి నట్లే అనిపిస్తుంది!......లేకపోతే మరేవిటి?...... ఈకాలంలో ఒక పది రూపాయిలు చేతివి పడ్డయ్యంటే ఆనెల జీవితపు నౌక తల్లక్రిందులయిందన్నమాటే!

"వెంకటేశు! లైటు ఆర్పి తలుపు వెయ్యి!" అన్నారు కుర్చీమీద ఉత్తరీయాన్ని బుజాన వేసుకుంటూ.

చిన్నగా నడిచి బస్సుస్టాపు దగ్గరకు వచ్చేటప్పటికి మరో అరగంట పట్టింది ఆయనకు.

"గుడ్డిలో మెల్లలా ఇదో ఆయం.....కొద్ది రోజులబట్టి సిటీ బస్సొకటి వేశారు......ఇదివరకు అరణాలు రిక్షా కిచ్చేది. ఈ రోజున పదిహేను నయాపైసలతో సరిపోతోంది!"

చిన్నగా నవ్వుకున్నారు రంగనాధరావుగారు. "మనకు హాయిగానే ఉన్నదిగాని ఈ సిటీ బస్సుల వలన రిక్షావాళ్ళకు ఎంత కష్టంగా ఉన్నదో?"

ఆరోజు రోడ్డంతా చాలా ఆహ్లాదంగా ఉన్నట్లనిపించింది. జేబులు గలగలలాడే ఆరోజు నిజంగా దేశంలో ఎక్కువమంది జనానికి పండుగదినం లాంటిది!

అంతదాకా ఎందుకు తనకుమాత్రం?—ఇటువంటి మొదటి తారీఖులు ఎన్నో చూచినా ఈ రోజుకూ అది పర్వదినంలాగానే ఉంటుంది—నెల కొక్కరోజున విశాలాక్షికి పూలు కొనుక్కువెళతాడు—అదే ఘనుడు!

ముప్పై ఏళ్ళక్రితం....అంటే తనకు పెళ్ళైన కొత్తల్లో రోజూ పువ్వులు కొనుక్కు వెళ్ళేవాడు ఇంటికి......అప్పుడంటే కానీపెడితే దోసెడు పూలొచ్చేవి....... ఈ రోజువో పది పైసలిచ్చినా లెక్కేసిగాని ఇవ్వడు!

నవ్వుకున్నారు రంగనాధరావుగారు గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

మనిషి పెరుగుతున్నకొలదీ శక్తి ఏలా క్షీణిస్తున్నదో అలాగే రోజు రోజుకీ, రూపాయికీ విలువ తగ్గిపోతున్నదీ— అనిపించింది.

ఈనెలలోనైనా లక్ష్మిని పిలుచుకువచ్చి చీరె కొనిపెట్టి పంపాలి!......ఎప్పటికప్పుడు వాయిదా పడుతూనే ఉన్నది......తనుమాత్రం ఏం జేయగలడు?......ఐదుగురు పిల్లలతో సంసారం ఈదుకొస్తుండేటప్పటికే జుట్టంతా నెరిసి పోతోంది!

రంగనాధరావుగారి మనస్సు చిన్నబోయింది...... కూతురి పెండ్లిచేసి రెండు సంవత్సరాలయినా పిలిచి ఒక మంచి చీరె కొనిపెట్టలేనందుకు— అంతదాకా ఎందుకు—పెండ్లి బాకీయే ఇంకా పూర్తిగా తీరలేదు!—'ఏం జీవితాలు ఇవి?' అనుకున్నారు నిరాశగా.

పెద్దవాడు—పెద్దవాడికి మాత్రం రోజూ ఇంటి నుంచి కాలేజీకి రెండు మైళ్ళు నడవాలి...... నడవలేక అఘోరిస్తున్నాడు......సైకిలు కొనిపెడదామంటే వెసులుబాటే లేకపోయె—ఏంచేయాలి?.. కాలేజీనుంచి తిరిగివచ్చే సమయంలో వాడిని చూచినప్పుడల్లా జాలివేస్తుంది—కాని ఏం లాభం?— తనో పెద్ద హైస్కూలుకు హెడ్మాష్టరనని పేరు తప్ప మరేమీలేదు!

ఆలోచనలతో మొఖాన పట్టిన చెమట బిందువులను మరోసారి తుడుచుకున్నారు.

ఇంతలోనే కిక్కిరిసివున్న సిటీబస్సు కాస్తా వచ్చి నిలబడటం, రంగనాధరావుగారు హడావుడి పడుతూ, ధోవతిని పైకి పట్టుకొని మరీదాంట్లో ఎక్కటం కొద్ది క్షణాల్లోనే జరిగిపోయినయి.

లోపలగూడా దాదాపు అరవైమంది ఎక్కవల్సిన ఆ బస్సులో ఎంభైమంది దాకా ఉన్నారు. బస్సు పోతున్నా లోపల చెమట పోసేటంతగా కిక్కిరిసి ఉనారు. ఒక్కొక్క క్షణంలో అనిపిస్తుంది ఆయనకు "పదిహేను నయాపైసలతో పోతుందిగదా అని ఈ కిక్కిరిసిన మహా ముద్రంలో ఒంటికాలి జపం కంటే అరణాలు పోయినా రిక్షానే మేలు!" అని. అనుకోవటమే గాకుండా నవ్వుకున్నరు గూడా.

కాని ఆయన మనస్సుకు మాత్రం చూస్తూ చూస్తూ తక్కువతో పోయేదానికి ఎక్కువ ఖర్చు పెట్టటం ఇష్టంలేకపోతోంది!

ఆ బస్సులోవున్న పది నిమిషాలు గంట అనిపించగా, తన ఇంటికి దాపుగోకంటె ఒక స్టేజీ ముందుగానే సెంటర్లో దిగారు. రోడ్డంతా పాల బలుబుల కాంతితో మెరిసిపోతోంది. లైట్లను అంటిపెట్టుకున్న పురుగులు జోరుగా ఎగురుతున్నాయి. ఏటు చూచినా జనం, రిక్షా బళ్ళ మోత......సైకిళ్ళ హడావుడి చెప్పనవసరమే లేదు......ప్రతి కొట్లోను జనం బెల్లంమీద ఈగల్లా మూగిఉన్నారు.

బస్సుదిగిన రంగనాధరావుగారు పట్టిన చెమటను పైపంచతో తుడుచుకుంటూ క్షణం పేవ్మెంటుమీద నిలబడ్డారు.

ఆయన వెనుకనే దిగిన మరోవ్యక్తి "గుడ్ మార్నింగ్ సార్!" అంటూ రంగనాధరావుగార్ని చూసి, గారబట్టిన పళ్ళతో నవ్వుతూ వెళ్ళిపోయాడు.

అతడిని చూస్తూనే రంగనాధరావుగారు నవ్వి, తడబడే స్వరంతో "గుడ్‌మార్నింగ్..... గుడ్ మార్నింగ్!" అన్నారు.

ఆయన కంఠం వణికింది.

అతడినిచూస్తే ఆయన కెందుకో భయం! ఆయన కదలకుండా పోతున్న అతడివైపు చూస్తూనే ఉండిపోయారు.

"పాపం! ఇవాళ ఎవరెవరికి మూడిందో!" అనుకున్నారు.

అప్రయత్నంగా నవ్వు వచ్చింది. కాని అతడిని చూచి తను ఎందుకు భయపడుతున్నాడో అర్థం కాలేదు......అంతే! సరాల బలహీనత తప్ప మరేమీ లేదనుకున్నాడు......కాకపోతే అతడి కబంధ హస్తాలలో తనూ ఇరుక్కుపోతాడనా......?

అతడు తన జోలికి వస్తాడా?......అందునా అతడి పిల్లవాడికి చదువుచెప్పే తన జోలికి!...... మరోసారి అతడు తన జోలికి రాడు అన్నంత ధైర్యంగా అనుకున్నారు.

కాని అనుమానం పెనుభూతం అవగా (అందులో అతడు తనతోబాటే తన వెనుకే ఆ బస్సులోనే ప్రయాణం చేయుటంతో) గబుక్కున పక్క జేబుమీద చెయ్యి వేశారు.

కాని మరుక్షణంలోనే గుండె ఆగిపోతుందేమో ననిపించింది. జేబుమీద వేసిన చెయ్యి కొయ్యలా బిగుసుకుపోయింది. మనిషిలోని నవనాడులూ కృంగిపోయినయి. మనిషి శిలా విగ్రహమే ఐపోయారు.

కొన్ని క్షణాలవరకు ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లే అనిపించింది.

ఏంచేయాలో తోచలేదు.

జేబులోని పర్సు పోయిందన్న నిజం ఆయనని మృతతుల్యుడిని చేసింది.

రాబోయే నెలకు ఆపురాపురుమంటూ ఎదురుచూస్తూ కూర్చుని తీసుకున్న జీతం కాస్తా, క్షణాల్లో ఎగిరిపోయింది! ...... దుఃఖం పొర్లుకొచ్చింది!

అలా జరగటానికి కారకు లెవరో గూడా తెలుసుకున్న ఆయనలో కోపం కట్టలు తెంచుకు ప్రవహించింది.

'ఛీ! ఛీ! కృతఘ్నుడు!" అనుకున్నారు.

వడి వడిగా అడుగులు ముందుకువేస్తూ కొద్ది నిముషాలక్రితం కనబడి, 'గుడ్‌మార్నింగ్' అన్న వ్యక్తికోసరం హడావుడిగా వెతకసాగారు.

చమటలు పడుతున్న శరీరంతో కళ్ళు బైర్లు క్రమ్ముతుండగా పిచ్చివాడిలా నలుమూలలా తిరిగి, నిరాశతో, నిస్పృహతో ఒక మూల నిలబడిపోయారు.

"ఏలాంటి దుర్దినం?"

"అసలు ఈనెల గడిచేదెలా?" ఆయనగుండె వేగంగా కొట్టుకోసాగింది.

"తనేంత పొరబాటు పని చేశాడు?......ఈ రోజునన్నా అరణాలుపోతే పోయినయి రిక్షాలో, ఇంటికి వెళ్ళి ఉండవల్సింది!......ప్చ్.....నుదుటిన అలా జరగాలని వ్రాసిఉంటే తనెలా వెళ్ళగలుగుతాడు?"

కళ్ళవెంట నీరు జలజలా కారుతుండగా నిస్సత్తువతో పీకుతున్న కాళ్ళతో ఇంటివైపుకు అడుగులు వేశారు.

వీధి మూలనున్న పూల దుకాణం కనబడినప్పుడు హృదయం గతుక్కుమన్నది. ఒక్కసారి బాధగా, జాలిగా 'విశాలా!' అనుకున్నారు.

ఒక్కక్షణం గూడా ఆలస్యం చేయకుండా ముందుకు అడుగులు వేశారు.

తనేం చేయాలి ఇప్పుడు?

—ఆయనకు అర్థంగాని ప్రశ్నే అది!

పోలీసు స్టేషన్లో రిపోర్టు ఇస్తేనో?—

నేను స్కూలు యొక్క పని అంతా పూర్తిగా చేశాను, అమ్మా...






అల్లాగ! అయితే, అతనికి ఒక
చాక్‌లెట్ ఇవ్వాలి—పాల యొక్క
గుణములు గలిగిన క్యాడ్‌బరీస్ చాక్‌లెట్!

Cadbury's క్యాడ్‌బరీస్ చాక్‌లెట్

మిఠాయిని మించినది ... ఆహారము!

తన జేబులో పర్సు ఎవరు తీసుకున్నారో తనకు తెలుసు—తను తిరిగి పోగొట్టుకున్న సొమ్మును పొందటానికి అంతకంటే ఇంకేం కావాలి?

అదే మంచిదనిపించింది—క్షణంలో మరో అనుమానంరాగా విచలితులయ్యారు—తన ఆశ గాని—పోలీసు స్టేషన్‌లో చెప్పినా తన మొర ఆల కించే దెవరు?......తన జేబులోనుండి అతడు పర్సు తీస్తుండగా తనుగాని ఏమైనా చూచాడా?... ఏవిటో పిచ్చి పిచ్చి వూహాలుతప్ప!

ఆ ఆశ గూడా పోవటంతో ఆయనకు సర్వం చీకట్లు క్రమ్మినట్లయింది.

రెండు సంవత్సరాల క్రితం పెండ్లిచేసి పంపిన కూతురుకు చీరెకొని పెట్టకపోవచ్చు, జాలిగా ఎండలో చమటలు పట్టేలా నడిచి వచ్చే కొడుక్కు ఒక పాత సైకిల్ కొనిపెట్టకపోవచ్చు—కాని తెల్లవారేటప్పటికి వచ్చే పాలవాడికేం చెప్పాలి, పెరుగువాడికేం చెప్పాలి, చాకలికేం చెప్పాలి—అంతదాకా ఎందుకు? పచ్చాలకొట్టు సుబ్బన్నకేం చెప్పాలి?—తిరిగి ముప్పై రోజుల జీవితాన్ని ఎలా వెళ్ళబుచ్చాలి?

ఆయన తడబడ్డారు.

నడవలేకపోయారు.

చీకట్లో నడుస్తున్న ఆయన కండ్లకు సీటి వీరలు అడ్డుపడినయి......ముందునెలల జీవితం అంధకారంలా కనిపించింది.

క్షణంకదలకుండా ఆగిపోయినఆయనకు మనస్సులో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. దాంతో ఆయన దృఢ చిత్తులయినట్టుగా నిట్టనిలువుగా నిలబడ్డారు. తరువాత మరుక్షణంలో గట్టిగా వూపిరి పీల్చుకొని, వడివడిగా పరుగెడుతున్నట్లుగా ఇంటి వైపుకు అడుగులు వేశారు.

"దానికి అది ఒక్కటే పద్ధతి!" అప్పుడప్పుడు గొణుక్కోసాగారు రంగనాథరావుగారు.

ఇంటిముంగు ఆగి దగ్గరకు వేసిఉన్న తలుపు లను లోపలికి నెట్టారు.

తీక్షణంగా నిప్పులు చెరిగే కళ్ళతో లోపలికి చూస్తూ "ఒరేయ్ రంగా!" పెద్దగా అరిచారు. భీకరంగా గర్జించినట్లే ఉన్నది ఆ కంఠం.

లోపల వరండాలో చదువుకుంటున్న ముగ్గురు పిల్లలు ఆ అరుపుకు ఉలిక్కిపడి తలలెత్తి వాకిటి వంక చూడసాగారు.

హెడ్మాష్టరుగారు!

పన్నెండేండ్ల రంగడు తడబడుతూ లేచి నిల బడ్డాడు.

రంగనాథరావుగారు బోను నుండి బయటపడ్డ సింహంలా ముందుకురికి, వాడి జుట్టు పట్టుకొని తల వంచి వీపు మీద దబదబా బాదసాగారు. ఇల్లు కొప్పెగిరి పోయేలా అరవసాగారు.

"వెధవరాస్కెల్! పోరా.....నాముందునించిపో!.. అప్రాచ్యుడా....మీనాన్నతోచెప్పు....మేష్టారిదగ్గర తీసుకున్న రెండువందల యాభై రూపాయలు తీసుకు వస్తేనే తప్ప తిరిగి తనకు మొఖం చూపించ వద్దన్నారని చెప్పు!"

రంగనాథరావుగారు ఆయాసంతో ఎగరొప్పసాగారు.

వాడితో [illegible]

# అతడి నిజాయితీ

ఇద్దరు పిల్లలూ శిలా విగ్రహాల్లా కూర్చున్నారు. ఆయన ఎప్పుడూ చేయని రాక్షస కృత్యాన్ని చూస్తూ తలుపుకు అంటుకు పోయింది భార్య విశాలాక్షి.

తరువాత రెండు నిముషాలకు చంకలో పుస్తకాలతో, ఒక చేత్తో జారుతున్నలాగును పైకి పట్టుకొని, మరుచేత్తో చొక్కా పెట్టుకొని కళ్ళు తుడుచుకుంటూ, వెక్కుతూ పోతున్న ఆ కుర్రవాడిని చూచినప్పుడు ఆ రంగనాథరావు గారికే కళ్ళవెంట నీరు జలజలా రాలింది.

తానేదో తప్పుచేసినట్లుగా బాధపడ్డారు. హృదయం ద్రవించింది. చేయెత్తి వెనక్కు పిలవబోయి గూడా గుండె చిక్కపట్టుకొని ఆగిపోయారు.

"తాను పాపిష్టివాడు!" అనుకున్నారు.

లేకపోతే ఏమీ తెలియని పన్నెండేళ్ల పసివాడి మీద అతడి తండ్రి పాపిష్టి పనులకు గాను పగ తీర్చుకుంటాడా?

కాని అంతకు మించి మరో మార్గంలేదు.

ఆలోచనల అల్లకల్లోలంలో వాడు పోయిన వైపే చూస్తుండి పోయారు కొన్ని నిముషాల వరకు.

"లోపలికి రండి!" ప్రశాంత గంభీర స్వరంతో అని వణుకుతున్న రంగనాథరావుగారి చేతిని పట్టుకొని లోపలికి తీసుకు వెళ్ళింది విశాలాక్షి.

ఆయన శూన్యంలో చూస్తూ మంచం మీద కూర్చున్న తరువాత, "ఏమైంది?.... ఎందుకలా అయిపోయారు?" అడిగింది అతి ప్రశాంతంగా.

ఆయన కంట్లో నీరు తిరుగుతుండగా, "నెల రోజుల కష్టార్జితం గంగపాలయింది.... ఆ నికృష్టపు వెధవ పొట్టన పెట్టుకున్నాడు!" అన్నారు.

"దానికి పాపం రంగడేం చేస్తాడు?...మీరావేశంలో కొట్టిన దెబ్బలు తగలరానిచోట తగిలితే మన పనేమయ్యేది?".

రంగనాథరావుగారు భయంతో బిక్కచచ్చిపోయారు. "నిజమే!...అలాంటిదేజరిగితే తనేమయ్యేవాడు?... పోయినడబ్బుపోగా జైల్లో ఊచలులెక్కపెట్టాల్సివచ్చేది జీవితం!...

"భగవాన్! తనెందుకింత తొందరపడ్డాడు?" రెండు చేతుల్లో మొఖం దాచుకున్నారు.

విశాలాక్షి కొన్ని నిముషాలవరకు మౌనంగా ఊరడి పోయారిది. ఒక నెల జీతం లేకపోతే పడవల్సిన బాధలు ఆమెకూ తెలుసు.

"కాళ్ళుకడుక్కోండి.... భోజనంచేద్దురుగాని!" అన్నది మెల్లిగా.

"నాకు ఆకలి కావడంలేదు!"

"ఎందుకని ఆకలికావటంలేదు.... డబ్బు పోవటంతోనే కడుపునిండి పోయిందా?.... పోయిన దానికి డొక్కను ఎండ పెట్టుకుంటే తిరిగి వస్తుందా? ఏదో ఒకటి చేయాలి.... భోజనంచేసి ఆలోచిద్దాం లేవండి!"

ఆయన మౌనంగా లేచి నిలబడ్డారు.

ఉన్నట్లుండి— ఒక అడుగు ముందు వేసినదల్లా వెనుదిరిగి— మెళ్ళో నుండి ఎన్నో సంవత్సరాల క్రితం నుండి ఉన్న మూడుపేటల చంద్రహారం తీసి ఆయన చేతికిచ్చింది.... "ఎక్కడో ఒకచోట పెట్టేశేయండి.... వీలు చిక్కగానే తెచ్చుకుందాం!"

"విశాలా!" ఆయన కంఠం రుద్ధమయింది. కళ్ళవెంట నీరు జలజలా రాలింది.

విశాలాక్షి మొఖం పక్కకు తిప్పుకుని దబదబా వంట ఇంట్లోకి వెళ్ళిపోయింది.

తరువాత భోజనం చేస్తున్న సమయంలో రంగనాథరావుగారు. "బహుశః వాడు డబ్బు తిరిగి ఇస్తాడేమో?"

"మీ పిచ్చి!" ఆమె చిన్నగా నవ్వింది. "ఆ మాత్రం జ్ఞానముంటే మీ దగ్గర నుండి తీసుకుండే వాడేగాదు!"

రంగనాథరావుగారిలో చిగురుస్తున్న ఆశను ఆమె త్రుంచి వేసింది.

ఆయన ఒక్క క్షణం ఆమె మొఖంలోకి చూచి తలవంచుకున్నారు.

ఆయనకు అన్నం సహించటం లేదు.

ఒకనాడు— వాడు—రంగడు తండ్రి—తన దగ్గరకు వచ్చి ఎలా ప్రాధేయపడ్డాడో గురుకు వచ్చింది.

"లేదుమాష్టారు! మీరు కాదు అనగూడదు.. నాయందు దయచూపించాలి.... నా కొడుకు ఎప్పుడూ నాలా తయారవ గూడదు!.... వాడు చదువుకోవాలి....! నలుగురిలో మెప్పు పొందాలి.... అందరిలో తనకు మించినవాడు లేదు అనిపించుకోవాలి.."

ఇంకా ఏవేవో చెప్పాడు కొడుకు తల నిమురుతూ.



## అతడి నిజాయితి

మంచి వూహాలున్నప్పుడు నీవు చేస్తున్న పనిని మానుకోవచ్చుగదా ? నలుగురిలోనూ మంచి వాడుగా పేరు తెచ్చుకోవచ్చుగదా ?"

"యుక్త వయస్సు వచ్చిన తరువాత ఎక్కువ రోజులు జైల్లోనే గడిపాను మాష్టారూ !.... ఎప్పుడు, ఎక్కడ ఎలాంటి దొంగతనం జరిగినా నాకోసరం పోలీసులు వెతుకుతుంటారు.... ఆరు సార్లు జైలుకు వెళ్లిన నేను మంచివాడుగా ఎలా పేరు తెచ్చుకో గలను ?.... నేను అనుకొని ప్రయత్నించినా నాకు ఉద్యోగమిచ్చేవారెరు? నా పొట్ట గడిచేదెలా ? ఏమీ లాభంలేదు మాష్టరూ !... ఈ జీవితం ఈలా వెళ్లిపోవాల్సిందే !"

అతడి మాటలకు తను ఆశ్చర్యపోయాడు. అతడు ఏమీ తెలియని మూర్ఖుడు మాత్రం కాదని పించింది !

తన వీధిలోనే ఉండే (స్వేచ్ఛా జీవిగా తిరిగే తక్కువ రోజులు) అతడిని గురించి తనకు బాగా తెలుసు— అతడిని గురించి అందరూ ఏమనుకుంటారో గూడా తనకు తెలుసు.

అంతదాకా ఎందుకు అతడి భార్యని, అతడి కొడుకుని ఏ పేరు పెట్టి పిలుస్తారో గూడా తనకు తెలుసు— దొంగాడి పెండ్లాం ! దొంగాడి కొడుకు!

ఒక్కక్షణం జాలివేసింది !

అందుకనే ఆ రోజున అతడికి ఉచితంగా విద్య చెప్పటానికి గూడా అంగీకరించాడు—అతడి కోరిక లాగానే— దొంగ కొడుకుకు ఎప్పుడూ దొంగ కాకూడదు !.... నలుగురూ ఆశ్చర్యపోయేలా అత్యున్నతమైన భారత పౌరుడిలా తీర్చిదిద్దాలి !.... కంకణం కట్టుకున్నాడు తను !

అటువంటి తన జేబునే అతడు కొట్టి, తన నెల జీవితపు కష్టాన్ని హరించి, తనని పరిస్థితుల కత్తెరలో ఇరికిస్తాడా ?

ఆయనకు ఆ రాత్రి నిద్ర పట్టలేదు !

మాటి మాటికి అతడిని ద్వేషించటంలోనే రాత్రి గడిచి పోయింది. రాత్రి తాలూకాఫీసులో కొట్టిన పన్నెండు గంటలూ విన్న ఆయన, తెల్లవారు ఝామున ఐదుగంటలూ విన్నారు.

కళ్ళు మంటలు పుడుతుండగా లేచి మంచం మీద శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయారు.

దాదాపు ముప్ఫై సంవత్సరాలకు పైబడి తను ఉద్యోగం చేస్తున్నాడు— కాని ఈలాంటిది ఎప్పుడూ సంభవించలేదు.... ఐదూ పదీ పోలేదనిగాదు.... మొదటి తారీఖునాడు ఆశలు, కోరికలు, అవసరాలు నడుమ తీసుకున్న నెల కష్టార్జితం ఇలా ఎప్పుడూ కాలేదు !

ఒక్కొక్క రోజు ఏలాంటి ఘోరాలు జరుగుతయ్యో జరిగేటంతవరకు తెలియదు గదా !

విశాలాక్షికి తను వివాహానంతరం ఏమీ స్వార్జితంలో కొనిపెట్టలేక పోయినా, ఈ రోజున ఆమె బంగారు గొలుసును తన అవసరాలకు తీసుకోవాల్సి వస్తోంది !

ఎంతగా బాధపడ్డా — అంతకు మించిన గత్యంతరం మరోటి లేదనిపించింది.

తూరుపు తెలతెలవారుతున్న సమయంలో నీరసంతో గూడిన బలహీనతతో లేచి కాలకృత్యాలు తీర్చుకోసాగారు.

విశాలాక్షి లేచి దొడ్లో పనిచేసుకోసాగింది.

పిల్లలు మొఖాలు కడుగుతున్నారు.

రంగానాధరావుగారు వాకిట్లో వాలుకుర్చీలో కూర్చొని రోడ్డు మీదకు చూస్తున్నారు నిరాశగా.

ఉన్నట్లుండి ఆయన ఉలిక్కిపడ్డారు. నిట్ట నిటారుగా కూర్చున్నారు. ఆయన హృదయంలో తెలియని ఆశ చోటు చేసుకుంది. కళ్ళువింతగా మెరిసినయ్. తడబాటుతో కుర్చీలో నుండి లేచి వడివడిగా ముందుకు అడుగులు వేశారు— వీధి వాకిలి దాటి లోపలికి వస్తున్న రంగడిని చూస్తూ !

"ఏరా ! ఏమైంది ?" హడావిడిగా అడిగారు.

రంగడు తల వంచుకొని జేబులో నుండి పెద్ద కవరు తీసి ఆయన కిచ్చాడు.




ఆయన వణక చేతులతో దానిని తీసుకొని ఆదుర్దాగా లోపల చూచేటప్పటికి కళ్ళు జిగేలుమన్నయి. హృదయం ఆనందంతో పారవశ్యం చెందింది. సంతోష ఉద్వేగాన్ని ఆపుకోలేక పోయారు. మొఖమంతా కాంతితో వెలుగుతుండగా, "విశాలా ! విశాలా !" అంటూ దొడ్డివైపుకు పరిగెత్త సాగారు.

చిన్న పిల్లవాడిలా కేకలేస్తూ వస్తున్న ఆయన్ని చూస్తూ ఆమె విభ్రాంతితో ఎదురు వచ్చింది.

"మన అదృష్టం బాగుందే ! వాడు మన డబ్బు పంపాడే !.... నిజం !.... ఇదుగో పంపాడు !" అన్నాడు.

"మంచిదే.... గండం గడిచిందన్న మాట !" ఆమె హృదయం తేలిక పడింది.

అత్యుత్సాహంతో వెనుదిరిగారు రంగనాధరావు గారు. గదిలోకి వెళ్ళి పెట్టె మూతతీసి కవరులో డబ్బు తీశారు. లెక్క పెట్టుకొని రెండు వందల యాభై ఉండటంతో తృప్తిపడి నవ్వుకుంటూ పెట్లో పెట్టి మూత వేశారు. వెనుదిరుగుతూ పెట్టె మీదగా ఉన్న దేవుని పటానికి కృతజ్ఞతగా నమస్కరించారు.

హుషారుగా ఆయన్ని చూస్తుంటే యువకుడిలాగానే కనబడ్డారు.

మరుక్షణంలోనే ఆయనకు ఆలోచన తట్టింది. వెనుదిరిగి పెట్టె దగ్గరి కెళ్ళి పెట్టెలో నుండి ఒక రూపాయి తీసుకొని, "ఒరేయ్ ! రంగడూ !" అంటూ బయట కొచ్చారు.

కాని అక్కడ రంగడు లేకపోవడం ఆయన్ని ఆశ్చర్య పరిచింది. కొన్త మనస్సు చిన్నబోయింది.

"పాపం ! రాత్రి వాడిని చాలా హింసించాడు. పిచ్చివెధవ ! ఎంతగా బాధపడ్డాడో !" అనుకున్నారు జాలిగా. "ఏమన్నా కొనుక్కుంటాడేమోనని ఓ రూపాయి ఇద్దామనుకుంటే చెప్పకుండా వెళ్ళి పోయాడే !" అనుకొని బాధ పడ్డారు గూడా.

ఒక విధంగా తను చేసిన పనే తను పోగొట్టుకున్న డబ్బును తిరిగి సంపాదించి— అహింసాత్మక మవ్వవచ్చు. ఒకరు చేసిన అన్యాయానికి మరొకరిని శిక్షించవచ్చు— కాని ఫలితం ఆనందదాయక మయింది !

ఆయనకు ఉచితంగా మరో నెల జీతం లభించినట్లే ఉన్నది. ఆయన ఆనందం చూస్తుంటే కాలు ఒక చోట నిలవటం లేదు !

ఈ పొద్దే లక్ష్మిని పిలుచుకువచ్చి చీర తప్పకుండా కొనిపెట్టాలి అని గూడా దృఢంగా నిర్ణయించుకున్నారు ఆయన.

వంట యింట్లో భార్య ఎదురుగ్గా పీట వేసుకు కూర్చొని ఆ నెలకు కావలసిన సరుకులన్నీ కాగితం మీద వ్రాశారు. పాలవాడు వస్తే ఏలా మొఖం చూపాలా అని భయపడ్డ ఆయన నవ్వుకుంటూ వెళ్లి మరీ ఇచ్చి వచ్చారు అతడు వచ్చినప్పుడు. చాకలివాడికి ఇచ్చారు. పెరుగువాడికి ఇచ్చారు.

బజాన కండువ వేసుకొని ఇంటికి పది బారల దూరంలో ఉన్న సుబ్బన్న కొట్టుకు వెళ్లారు.

సుబ్బన్న డబ్బు తీసుకుంటూ "పొద్దున్నే ఏం తొందరొచ్చిందండీ... సాయంత్రం ఇవ్వవచ్చుగా !" అన్నాడు.

"లేదులే .... తీసుకో !" అన్నారు తడబడుతూ.

ఈ ఆనందంలో తను మర్చిపోయాడు నిజమే.— ప్రతి వేళా సాయంత్రం పూట తీసుకువెళ్ళి ఇచ్చే అలవాటు !

ఇంటికి తిరిగివస్తూ తను చేసిన పనికి నవ్వుకున్నారు గూడా.

ఇంటికి వచ్చేటప్పటికి వంట తయారయింది. భోజనంచేసి స్కూలుకు బయల్దేరారు. ఈరోజున ఎందుకో రిక్షామీద వెళ్ళాలనిపించింది. రిక్షా పిలిచి ఎక్కి కూర్చున్నారు.

సెంటరులో మలుపు తిరుగుతునప్పుడు పూల దుకాణం కనుపించగా "ఇవాళ సాయంత్రం విశాలక్ష్మికి తప్పకుండా పూలు కొనుక్కు వెళ్ళాలి !' అనుకున్నారు.

నిజంగా ఎలాంటి సంఘటన ! .... దాదాపు పన్నెండు గంటలు తనను ఉక్కిరి బిక్కిరి చేసింది.

తను తెలివిగా చేసిన పనికి వాడు ఎంతగానో భయపడి ఉంటాడు—లేకపోతే ఏ దొంగైనా తీసుకున్న డబ్బు తిరిగి ఇస్తాడా అంత తేలిగ్గా—తన కొడుకు చదువు ఎక్కడ నాశన మవుతుందో, తన లాగే ఎక్కడ తయారవుతాడో నని భయమేసి ఉంటుంది !

ఓ పెద్ద రాక్షసుడి ప్రాణం ఏ చెట్టు తొర్రలోనో ఉన్న పిట్ట గొంతులో ఉన్నట్లుగా రంగడి తండ్రిని పట్టే కీలకం రంగడి చదువులో ఉండనిపించగా నవ్వు పొర్లుకొచ్చింది రంగనాథరావుగారికి.

తన గదిలోకి వెళ్ళి బుజాన కండువా కుర్చీమీద వేసి కుర్చీలో సావకాశంగా కూర్చుంటూ, అప్పుడే అటు పోతున్న తెలుగు మాష్టారు అవధానిగార్ని "ఏమయ్యోయ్ అవధాని ! .... ఒకసారిలారా !" అన్నారు హుషారుగా.

రాత్రి జరిగిన సంఘటన నలుగురికీ చెప్పాలనిపించింది—అందునా దానిని తను విడదీసిన పద్ధతి—గర్వంగా !

అలవాటుగా కేసులోనుంచి కళ్ళజోడు తీశాడు. కేసు డ్రాయర్లో పడేద్దామని డ్రాయరు తాళం తియ్యసాగారు.

"నమస్కారమండీ ! ...." అన్నారు అవధాని. ఆయనకు కొత్త హెడ్మాస్టరుగారి దగ్గర చనువెక్కువ. "ఏమిటో హుషారుగా ఉన్నట్లున్నారు....."

"ఆఁ .... ఆఁ .... చెబుతాను కూర్చోండి..... ఇలా తొందరపడితే ఎలా ?" అని ఒక్క క్షణం తలెత్తి నవ్వి డ్రాయరు సొరుగు బయటకు లాగాడు.

లాగిన సొరుగు లోపల చూస్తూనే ఉలిక్కిపడ్డారు రంగనాథరావుగారు. కళ్ళు కుంచించుకుపోయినయ్యి. నోటివెంట మాట రాలేదు. గుండె దడదడ లాడసాగింది. ఎవరో వెన్నుమీద బలంగా చరిచినట్లే అయింది.

ఒక్క క్షణం కలా నిజమా అనిపించింది!

కళ్ళు రెపరెప లాడించి మరీ చూచారు.

అవధానిగారికి ఈయన వడత అర్థంకాక "ఏమిటి అలా వింతగా చూస్తున్నారు ?" అన్నారు. లేచి నిలబడి, వంగి ఆయన సొరుగులోకి చూడటానికి ప్రయత్నిస్తూ.

45 వ పేజీచూడండి



మందరపు లలిత

## జరిగిన కథ

విభిన్న మనస్తత్వాలు గల ఐదుగురమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయన స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాస్ చూడ్డానికొచ్చి కళను ప్రేమిస్తాడు. పెద్దలంతా కళను వాళ్ళ బావ శేఖర్‌కిచ్చి వివాహం చేయాలనే సంకల్పంతో ఉంటారు. అందుకు భిన్నంగా శేఖర్ శారదచే ఆకర్షింపబడ్డాడు. శేఖర్‌తో సినిమా కెళ్ళిన కళను సుధాకర్ స్నేహితుడు మోహన్ చూసి బయటికెళ్ళిపోతాడు. మోహన్ సుధాకర్ విషయాలేమైనా చెప్తాడేమో తెల్సుకోవచ్చనుకున్న కళ చాలా నిరుత్సాహపడుతుంది. కళ సుధాకర్‌ను మరచిపోయిందని భావించి మోహన్ చాలా బాధపడ్తాడు. వైజాగ్ నుంచి తిరిగి వచ్చి గీతని కల్సుకుంటాడు. కళనైతే వివాహం చేసుకుంటానని తల్లికి తెలియజేస్తాడు. కొంత వాగ్వివాదం జరిగిన మీదట సుధాకర్ తండ్రి రామయ్యగార్కి ఆ విషయాన్ని తెలియజేస్తూ ఉత్తరం వ్రాస్తాడు. మరదలితో మళ్ళీ కనబడితే ప్రాణాలు దక్కవని శేఖర్‌కు రామన్న ఉత్తరం వ్రాస్తాడు. తనకు కళను చేసుకోవటం ఇష్టం లేనట్లు కళ బలవంతంమీద రామయ్యగార్కి వ్రాయటానికి నిశ్చయించుకుంటాడు శేఖర్. సారంగ ప్రియ కపోయింతో చిత్రను పిలిచి జరిగినదానికి క్షమాపణ కోర్తాడు.

## (గత సంచిక తరువాయి)

పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న సారంగను చూస్తే చిత్రకు ఏడుపొచ్చింది. దిక్కుమాలిన పవరంకోసం సారంగను ఎంత ఏడిపించింది? రంభ లేచినిలబడి చెవులుగట్టిగా దులుపుకున్నది.

"నన్ను క్షమించానవండి... అంతవరకు నాకు శాంతి ఉండదు..................."

దీనంగా మరోకసారి అర్థించాడు సారంగ.

చిత్ర కనికరంతో "ఇందులో నాతప్పుకూడా ఉందిలెండి... ఊర్వశి నిస్తారా? బావ దానికోసం బెంగ పెట్టుకున్నాడు—" అంది.

సారంగ ఒక్క ఉదుటున ముందుకు వంగాడు.

"మీరు —— మళ్ళా మొదటికే వచ్చారు! మీ బావ కుక్కను దొంగతనం చేయలేదంటే నమ్మరేం? ఇది నా కుక్క రంభ!"

రంభకోసం సారంగ కలయజూశాడు. రంభ గదిలో లేదు. గదిబైట పడుకుని చల్లని గాలికి సుఖంగా నిద్రపోతున్నది.

చిత్ర మనస్సు కోపంతో నిండిపోతున్నది.

"మీరు రంభ అనండి, మరొకటి అనండి! అది మా బావ కుక్క.... చూసి ఆనవాలు పట్టలేనంటారా? హూ!" అంటూ హుంకరించింది.

కోపంగా ఉన్న ఆడవాళ్ళని మరి కాస్త రెచ్చగొట్టాలనిపిస్తుంది. కాని, చిత్రను చూస్తే చిత్రం ఏమిటో తెలియదు కాని జాలేస్తున్నది. బ్రతిమాలుకోవాలనిపిస్తున్నది.... దూరంగా ఉన్న సముద్రం చల్లనిగాలిని చెంతకు పంపుతున్నది. చిత్ర నుదుటిమీద ముంగురులు కంగారుగా పరిగెట్టాయి. చిత్ర ఆగ్రహం చూసి అవి ఎలా బెదిరిపోతున్నాయో అనుకున్నాడు సారంగ.

చిత్ర గదిలో లేదు. రంభకు కాస్త దూరంలో నిలబడి దురుసుగా "మీ రిచ్చినా, ఇవ్వకపోయినా నేను దీన్ని తీసుకెళ్ళి బావకిస్తాను" అంది.

సారంగ నీరసంగా మూలిగాడు.

"ఇస్తే ఇవ్వండి. నేనేం బెంగపెట్టుకోను— కాని అది ఊర్వశి కాదని వాడికీ తెలుసు!"

చిత్ర ఆశ్చర్యంగా చూస్తూ గదిలోకి వచ్చింది.

"ఊర్వశి, రంభ ఒకే ఊరకుక్కకు ఒకే రోజున పుట్టాయి. వాడో కుక్క, నేనో కుక్క తీసుకున్నాం. ఒకేలా పెంచుకొన్నాం.... వాడి ఊర్వశిపోతే దీన్ని పట్టుకోవచ్చు. కాని వాడు అదీ, ఇదీ ఒకటే అని సరిపెట్టుకోగలడా అని సందేహం!"

చిత్రకు ఆశ్చర్యంతోపాటు అనుమానం కూడా వేసింది. సారంగ మాటలు ఎంతవరకు నిజం?

"ఊర్వశి—రంభ—నిజమేనా? చిత్రమైన పేర్లు!...." అనుకున్నది చిత్ర పైకి.

"చిత్రంగా ఉన్నాయంటారా? ఊర్వశికి ఉత్పత్తి అర్థం ఊరకుక్క అని... నేనే సజెస్ట్ చేశాను. శేఖర్‌కు చాలా నచ్చింది—"

చిత్ర మనోహరంగా నవ్వింది. చిత్ర నవ్వగా చూడటం ఇదే మొదటిసారి! సారంగ తన్మ

"ఊరకుక్కకి ఊర్వశికి ఏలా ముడిపెట్టారండి? భలేవారే! మొత్తానికి మీది బ్రహ్మాండమైన ఐడియా!"

సారంగ నవ్వబోయి బుగ్గలు బాధపెట్టగా ఆ ప్రయత్నం మానుకున్నాడు.

"నా స్వంత ఐడియా కాదులెండి! ఈ రోజుల్లో అందరూ అలాగే చేస్తున్నారుగా? సూర్యనారాయణ సురేష్, సత్యనారాయణ సతీష్ అయినట్లే... ఆ మాటకొస్తే నా పేరు కూడా అంతే .... మా నాన్నగారి పేరు రంగయ్య.... నా పేరు సారంగ!.."

"హూ! మరి మీ కుక్కకి రంభ అని ఎందుకు పేరు పెట్టారు?"

"రెండూ ఒక తల్లి పిల్లలు. ఒకదానికి ఊర్వశి అని పెట్టాక మరోదానికి ఏ 'టామీ' యో పెడితే ఏం బాగుంటుంది? అందుకని ఊర్వశి, రంభ అని పెట్టాం....."

చిత్ర గదిబైటకు చూపులు సారించి హడావిడిగా కుర్చీలోనుంచి లేచింది.

"చాలా చీకటి పడింది. మరి నేను వెళ్ళాలి..."

సారంగ రెండు చేతులూ జోడించి "నన్ను క్షమిస్తారుకదూ?" అన్నాడు.

చిత్ర మనస్సు ఆర్ద్రమయింది. ఉత్త పుణ్యానికి దొంగతనం కూడా అంటగట్టింది! తనే అతని స్థితిలో ఉంటే క్షమించమనటందాకా ఎందుకు గుమ్మంలో కూడా కాలు పెట్టనిచ్చేది కాదు. అతని మంచితనం తను భరించలేకపోతున్నది.... తను తొందరపడి ఎంత మోటుగా ప్రవర్తించింది?

చిత్ర కనుకొలకుల్లో నీళ్ళు తిరిగాయి. ముఖాన్ని మరోవైపుకు తిప్పి "నన్ను క్షమించరూ?" అన్నది.

* * *

శేఖర్ గదిలో శారద పుస్తకాలు ముందేసుకొని కూర్చున్నది. ఇంగ్లీషు పుస్తకం చేతిలోకి తీసుకొని చదవబోయింది. వాక్యాలన్నీ ఎడతెగని చీమలబారుల్లా కనిపిస్తున్నాయి..............

ఈ మధ్య బావ తనకు పాఠాలుచెప్పడం మానివేశాడు... ఎందుకో తెలీదు తనని తప్పుకుతిరుగుతున్నాడు. బావకుకోపం తెప్పించే పనితనేం చేసింది? బావ సంతోషిస్తాడని రోజూ కష్టపడి పాఠాలు చదువుతున్నది. అయినా బావమాత్రం ఉత్సాహంగాకనబడటం లేదు. తనకేమిటో భయంగా, బెంగగా ఉన్నది.

గదితలుపులు తెరచిఉన్నాయి.— అవతల వరండాలో కూర్చుని శూన్యంగా ఆకాశంలోకి చూస్తున్న శేఖర్ కనిపించాడు.

గదిగుమ్మంముందునిలబడి శారద "బావా! పాఠాలు చెప్పటమే మానివేశావ్?.. నువ్వుచెప్పినట్టే చదువుకుంటాలే బావా! ఏమాట జవదాటను—" అంది ప్రాధేయపడుతున్న ధోరణిలో.

శేఖర్ మౌనంగా శారదవంక చూశాడు. అమాయకంగా కనబడుతున్న ఆ వదనంలో ఎంత దిగులు! తను ఏం చెప్పినా నమ్మించగలడు?

"నాకు వంట్లో బాగుండలేదు. వీలుచూసుకుని నువ్వే చదువుకో శారదా! లేకపోతే మీఅక్కదగ్గర నేర్చుకో" శారద [illegible]

“[illegible] బావా ఇలా [illegible] ? [illegible] పోతే డాక్టరుకు చూపించుకో. అశ్రద్ధచేస్తే ఎలా ? నీకువంట్లో బాగున్నప్పుడే చదువు పేర్పుడుపు గాని... ముందు ఆరోగ్యం సంగతి చూసుకో..అత్తయ్యకి చెబితేనేగాని నువ్వు డాక్టరు దగ్గరి కెళ్ళవ్ !”

శేఖర్ గాభరా పడ్డాడు.

తనకేం నిక్షేపంలా ఉన్నాడు. లేనిపోని రోగం కల్పించి ఏ డాక్టర్ దగ్గరి కెళ్ళడం? అమ్మకి తెలిస్తే తనని నిలబడ నివ్వదు, లేచి తిరగ నివ్వదు—.

“జబ్బేమీ కాదులే—తలనొప్పిగా ఉంది.. [illegible] కూర్చుంటే మరీ ఎక్కువవుతుందని...”

శారద మనస్సుతేలిక పడింది.

“బైటకలా వెళ్ళితిరిగొస్తే ఏ తలనొప్పీ ఉండదు. బావా !.. అన్నట్టు లక్ష్మిలో మంచి తెలుగు సినిమా వచ్చింది. నన్ను తీసికెళ్ళవా ?” అంది కోముగా.

గదిలో గోడమీది గడియారం టంగు, టంగు మని నాలుగు గంటలు కొట్టింది. మరో రెండు గంటలకు మొదటి ఆట ప్రారంభం...రెడీకావటానికి కావాల్సినంత టైమున్నది.

శేఖర్‌కు ముచ్చెమటలు పోసాయి. వికసించి ఉన్న శారద మోమును చూడలేక తల దించుకున్నాడు. తనూ, శారదా కలిసి సినిమాకెళ్తే ఇద్దరూ కలిసి తిరిగి ఇంటికి రాగలరా ? తనప్రాణాలగురించి తనకు బెంగలేదు. కాని అన్నితెలిసిఉండి శారదను హంతకుని చేతికప్పగించడానికి తనకు ప్రాణం ఒప్పటం లేదు. తను కటువుగా ఉండకపోతే శారద ప్రాణాలు దక్కవు. సున్నితమైన శారద హృదయాన్ని బాధపెట్టాలంటే తన ప్రాణం గిలగిలలాడుతున్నది.

“నన్ను వేధించకు శారదా ! నాతోనువ్వురావద్దు. నాకిష్టం లేదు—” అంటూ శేఖర్ గభాలున లేచి వీధిలోకి వెళ్ళాడు.

శారద నిశ్చేష్టురాలైంది.

బావ !...బావేనా ఇలా మాట్లాడింది,? తనేం తప్పుచేసిందని?.. శారద నీరసంగా పుస్తకాలు పడి ఉన్న చోటికి వెళ్ళింది. ఇందాక తాను తెరిచి ఉంచిన పుస్తకం అలానే ఉంది. యాంత్రికంగా పుస్తకం చేతిలోకి తీసుకుంది. చీమలబారుల్లా కన్పించిన వాక్యాలు ఇప్పుడు అలుక్కుపోయి అగమ్యగోచరంగా ఉన్నాయి. ముత్యాల్లాంటి నీటిబిందువులు టప్,టప్ మంటూ వాటిమీద నుండి జారాయి. ఓహో! తను ఏడుస్తున్నది...............

తనతలను ఎవరో ఆప్యాయంగా నిమురుతున్నారు.

“ఏడ్వకు శారదా! బావ సంగతి నేను చూస్తాను. నామాట నమ్ము !”

కళ ఓదార్పుతో శారద దుఃఖం కట్టలు త్రెంచుకుని ప్రవహించింది. ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుని మనస్సు స్థిమిత పడేంతవరకు కన్నీళ్ళు కార్చింది.

రాత్రి ఎనిమిది గంటలకు శేఖర్ వూడిపడ్డాడు. కళ శేఖర్‌రాకకోసం కాచుకుని ఉంది. శేఖర్ భోజనం చేసివచ్చాక మెల్లిగా దగ్గరకెళ్ళి మొదలుపెట్టింది.

“నాన్నగారి ఉత్తరానికి జవాబు ఏం వ్రాయాలను కుంటున్నావ్ ?”

శేఖర్ జ్ఞాపకంలేనట్టు “ఏ ఉత్తరం?” అన్నాడు.

“అదే ! గీతను చేసుకోమని.........”

శేఖర్ నిర్లక్ష్యంగా నవ్వటానికి తంటాలు పడుతూ “అప్పుడే పెళ్ళికేం తొందర ? నాకసలు పెళ్ళిచేసు కోవాలనిలేదు.........” అన్నాడు.

కళ గంభీరంగా అంది.

“మగవాడివి ఏడిచేసినా చెల్లుతుంది. అయినా నీకోసం శారద ఎంత ఏడుస్తున్నదో ఒక్కసారి ఆలోచించిచూడు !................”

శేఖర్ గుండె రాయిచేసుకుని అన్నాడు.

“నేను శారదనుచేసుకుంటానని ఎప్పుడు చెప్పాను? శారదకు మంచి సంబంధంచూసి చేసుకోండి. అదే అన్నివిధాలా శ్రేయస్కరం...............”

కళ తెల్లబోయింది.

అవున్లే ! ఆడదానికి ఒక మనస్సంటూ ఉండ కూడదు, మగవాడు రమ్మంటే రావాలి, పొమ్మంటే పోవాలి........” అంది కసిగా.

అయినా శేఖర్ చలించలేదు. హృదయంలేని మగవాళ్ళా అని చీదరించుకున్నది కళ.

పడుకోబోయేముందుకళ గీతకుఉత్తరం వ్రాసింది.

“......బావ శారదతో చనువుగా ఉండేవాడు. శారదను చేసుకుంటాడని ఎంతో అనుకున్నాం. కాని దురదృష్టంకొద్దీ బావ చాలా మారిపోయాడు... ఇప్పుడు బావకి శారద పేరంటేనే గిట్టటంలేదు. సడన్‌గా బావ ఎందుకలా మారిపోయాడో మాకేం అంతుబట్టటంలేదు...............”

పరిస్థితులు గీతకు వెళ్ళబోసుకోవటంతో మనస్సు కొంచెం తేలికపడింది. కళ ఉత్తరం పూర్తిచేసి పక్కమీద ఆలోచిస్తూ పడుకున్నది. కళకు తెలియకుండానే మనస్సు సుధాకర్‌ను చేరుకుంది.

సుధాకర్ తనను పెళ్ళిచేసుకుంటాడట ! అనం



# పోటీలేనిది —

## నాణ్యతకైనా సరే, ధరకైనా సరే!



ఈ నేషనల్-ఎక్కో మాన్‌సూనైజ్డ్ రేడియోల యొక్క ధరలు, డిజైను, ప్రత్యేకాంశములు మరియు పనితనమును యితర రేడియోలతో పోల్చి చూడండి. నేషనల్-ఎక్కో రేడియోలే మీ డబ్బుకు తగిన విలువనిస్తాయని మీరే అంటారు. ఈ రేడియోలు ఉష్ణదేశములలో ఉపయోగమునకై ప్రత్యేకముగా తయారు చేయబడ్డాయి. వీటి భాగములకు ప్రత్యేకమైన రక్షణ యివ్వబడింది. కనుక యీ రేడియోలు పాడవకుండా ఏళ్ల తరబడి బాగుగా పనిచేస్తాయి, మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో డీలరువద్ద వీటిని నేడే వినండి!

**మోడలు 806:**
6 వాల్వులు, 3 వేవ్ బ్యాండులు.
సొగసైన కఱ్ఱ క్యాబినెట్. మోడలు యు-806 ఎసి/డిసి సెట్. మోడలు ఎ-806 ఎసి సెట్.
రు. 396.00

ధరలలో ఎక్సైజ్ డ్యూటీ చేర్చబడినది. పన్నులు అదనము

# నేషనల్ ఎక్కో

## మాన్‌సూనైజ్డ్ రేడియో







**మోడలు యు-819:**
ఎసి/డిసి. సెట్. 5 వాల్వులు, 3 వేవ్ బ్యాండులు. ప్లాస్టిక్ గ్రిల్‌గల సొగసైన బేకలైట్ క్యాబినెట్.
రు. 298.00

**మోడలు ఎ-829:**
ఎసి సెట్. 6 వాల్వులు. 4 బ్యాండులు. అందమైన బేకలైట్ క్యాబినెట్. పుష్‌బటన్ టోన్ కంట్రోలు. పియానో కీ స్విచింగ్.
రు. 481.00

**మోడలు ఎ-786:**
ఎసి సెట్. 6 వాల్వులు. 5 వేవ్ బ్యాండులు. అందమైన కఱ్ఱ క్యాబినెట్. రొటేటింగ్ ఫెరైట్ ఏరియల్. పియానో కీ స్విచింగ్.
రు. 575.00

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్ బొంబాయి • కలకత్తా • పాట్నా • మద్రాసు • బెంగుళూరు • ఢిల్లీ • సికిందరాబాదు

IWT GRA 3121

దేంతో వూపిరి సల్పటంలేదు తనకు. ఎన్ని సందేహా లతో సతమతమైంది ? ఎంత నిరాశను అనుభవించింది ?...ఇప్పుడు తలచుకుంటే నవ్వొస్తున్నది. సుధాకర్! ఇదివరలా ఇప్పుడు తను అతన్ని ధైర్యంగా కళ్ళెత్తి చూడగలదా ?

కళ సిగ్గుతో ముఖం తలగడలో దూర్చింది.

## 12

గీత తీరికగా డ్రాయింగ్‌రూంలో కూర్చున్నది. సాయంత్రం అయిదు గంటలవేళ—ఉష మరో గదిలో కూర్చుని ఏదో కుట్టుకుంటున్నది.

ఆరోజు హోటల్లో హఠాత్తుగా వదిలేసి వెళ్ళిన మోహన్ రెండు, మూడు రోజుల తర్వాత ఇంటి కొచ్చి క్షమార్పణ చెప్పుకున్నాడు. ప్రభాకర్ లైబ్రరీ కెళ్ళి కిరో పుస్తకం తెచ్చుకున్నాడట. ప్రేయసి కోసం వేస్తున్న వేషం అని చెప్పాడట. అందుకని తన మీద అనుమానం వేసిందట. మగవాళ్ళకి ఎంత అనుమానం. తనకు చూచాయగానైనా ఆ విషయం చెప్పి ఉంటే అప్పుడే అతని బెంగ తీర్చి ఉండేది. ప్రేమ అనేది లేకపోతే అనుమానం మాత్రం ఎందుకు వేస్తుంది ? మోహన్‌కు నిజంగా తనమీద ....?

గీత కళ్ళు మూసుకుని సన్నగా నవ్వుకున్నది.

"ఏ లోకంలో ఉన్నారు ?"

గీత కళ్ళు విప్పి నవ్వింది. మోహన్ కుర్చీలో కూర్చుంటూ "మీరు నాతో ఒక్కసారిలా పోస్టాఫీసు వరకు వస్తారా ?" అనడిగాడు.

గీత అర్థంకానట్టు చూసింది.

మోహన్ గొంతుక తగ్గించి చెప్పాడు.

"పోస్టాఫీసుకు ఎదురుగా ఒక ఇంటరుగుమీద ఒకతను ఆరూఢం బ్రహ్మాండంగా చెప్తాడట. ప్రభాకర్ వెళ్ళి చూసి రమ్మని మరీ మరీ చెప్పాడు. తొందరగా రండి. ఆర్నైతే అతనుండడు—"

"చెప్తే చెప్పాడు మీరు వెళ్ళి చూపించుకోండి! నాకేం వద్దు ...." అంది గీత విరక్తిగా.

తనకి, గీతకి పెళ్ళయితే కాని ఉషకి పరిణయం కాదట.

"ఆ ముసలాయన నువ్వంటేనే మండిపడతాడు. మరి మీ యిద్దరికీ పెళ్ళిలా జరుగుతుందో నాకు ఒకటే బెంగగా ఉంది..... ఆ ! జ్ఞాపకం వచ్చింది. బిగ్ స్ట్రీట్ పోస్టాఫీస్ ఎదురుగా ఒకతను బ్రహ్మాండంగా ఆరూఢం చెప్తాడట. వెళ్ళి చూపించుకొచ్చారంటే అందరిబెంగా తీరుతుంది—" అని ప్రభాకర్ సూరిపోశాడు.

అందుకే మోహన్ "మీరలా అంటే కాదు! నా కోపమైనా మీరు రాకతప్పదు!" అన్నాడు బతిమాలుకుంటూ.

గీత అయిష్టంగా కుర్చీలోనుంచి కదిలి ఉష ఉన్న గదిలోకి తొంగిచూసింది.

"ఉషా ! వేరలా వెళ్ళి వస్తాను, కాని కాస్త తలుపు మూసుకో ! అంటూ మోహన్‌తో పాటు వెళ్ళింది ....

ఇద్దరూ మాట్లాడకుండా నడుస్తున్నారు. కొంతదూరం నడిచాక మోహన్ "అతనే" అని కాస్త దూరానికి చెయ్యి సారించాడు. ఒక ఇంటి అరుగుమీద రెండు, మూడు చివికిపోయిన పుస్తకాలను పెట్టుకుని ఒక ముసలాయన కూర్చున్నాడు. అతన్ని చూడగానే గీత ఉలిక్కిపడింది.

## అయిదు రెళ్ళు

"అరె ! విస్తరాకుల సుబ్బన్న కదూ ?.... వీడికి ఆరూఢం ఏమి తెలుసు నా మొహం ! మొన్న మొన్నటిదాకా మా వీధిలో విస్తరాకులు అమ్ముతూ ఉండేవాడు....."

మోహన్ కోపగించుకున్నాడు.

"తప్పు ! తప్పు ! లెంప లేసుకోండి. ఇతను మహా పండితుడు. విస్తరాకుల సుబ్బన్నకి, ఇతనికి సంబంధం ఏమిటి ? .... ఇంకా నయం ! పిధు లాడ్చే పిచ్చయ్య, ఇతను ఒకరే అన్నారుకాదు—"

గీత మాట్లాడలేదు. ఇద్దరూ ఆ ఇంటిని చేరుకుని మెట్లెక్కి అతను కూర్చున్న చోటికి వెళ్ళారు. ఆ ముసలాయన తలెత్తి ఆశ్చర్యపోయినట్టు చూశాడు.

"ఏమమ్మా ! ఇలా వచ్చారు ?" అన్నాడు సర్దుకుని కూర్చుంటూ.

"ఎందుకొస్తాంలెండి ! ఆరూఢం చెప్పించుకుందామనే ! మీరు కరెక్టుగా లెక్కగట్టి మా ఇద్దరికీ పెళ్ళవుతుందో, లేదో చెప్పాలి—" అన్నాడు మోహన్.

ఉత్సాహంగాలేని గీత ముఖంలోకి అతను వంకో చంగా చూస్తున్నాడు.

ఎంత నమ్మకం లేకపోతే మాత్రం ముఖం లోనే తన అయిష్టమంతా చూపించుకోవాలా ? ఆరూఢం వాడు ఏమనుకుంటాడు ? అతనిచేత నిజం చెప్పిస్తేనేగాని గీతకు నమ్మకం కలుగదు కాబోలు !

"ఏమమ్మల్ని చూస్తే మా గీతకు విస్తరాకుల సుబ్బన్న జ్ఞాపకం వస్తున్నాడట. మీకు విస్తరకులు అమ్ముకునే ఖర్మేం అంటే వినిపించుకోవటంలేదు... కాదని మీ నోటితో చెప్పారంటే ఆవిడ అక్షరాలా నమ్ముతుంది...."

ఆరూఢంవాడు తెల్లగా పాలిపోయాడు.

"బాబ్బాబూ ! మీకు పుణ్యం ఉంటుంది విస్తరాకుల సంగతి ఎత్తకండి ! .... మీకేం బాబూ ఈడూ, జోడూ విక్షేపంలా పెళ్ళవుద్ది ...."

అంటూ వాళ్ళిద్దర్నీ దీవించాడు.

ఇంటికి తిరిగి వెళ్తున్నప్పుడు "విస్తరాకుల సుబ్బన్న ఆరూఢం ఎప్పుడు నేర్చుకున్నాడు చెప్మా ?" అంటూ మోహన్ ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"నేర్చుకున్నాడు? మీరూ చెదలు తినేసిన రెండు పుస్తకాలు ముందేసుకుని ఇంటిముందు అరుగు మీద కూర్చోండి.........."

"అలాఅనకండి ! అతను అన్నది అక్షరాలా నిజమౌతుంది. మనిద్దరికీ తప్పకుండా పెళ్ళవుతుంది..."

గీత నిట్టూర్చింది.

"బావ నన్నుచేసుకుంటానని ఉత్తరం వ్రాశాడు."

మోహన్ గుండెలు గుభేలుమన్నాయి. సుధాకర్‌ని వదిలి తనని పట్టుకుందా ఈశని ? అసలీ బావగాడు పుట్టకపోతే లోకం ఏడ్చేదా ?

మోహన్ దిగులుగా అడిగాడు.

"మీరు చేసుకుంటానన్నారా ? "

గీతమాటిగా జవాబివ్వలేదు.

"బావ శారదను చేసుకుంటే బావుండును..... ఇన్నాళ్ళూ చేసుకుంటాడనే అనుకున్నారట. శారదంటే ఎంతో ప్రేమగా ఉండేవాడట.... అలాంటిది పెళ్ళిమాట వచ్చేసరికి పెళ్ళివద్దన్నాడట. మగవాళ్ళు ఎంతలో మారిపోతారో చూడండి ! అంతకు ముందు ఇద్దరూ కలిసి సినిమాలకు వెళ్ళేవారట. బావ దానికి చదువు చెప్పేవాడట........."

గీత మోహన్ ముఖంలోకిచూసి ఉలిక్కిపడింది.

"అదేం? అలాఅయిపోయారు ?" అనడిగింది కంగారుగా.

మోహన్ సర్దుకుని "అర్జెంటుగా వూరికెళ్ళాలి.. మీరుఒక్కరే ఇంటికెళ్ళగలరా ? మరేం అనుకోరు కదూ ?" అన్నాడు.

గీత అయోమయంగా చూసి నిట్టూర్చింది.

"మళ్ళా ఎప్పుడొస్తారు ?"

"ఎప్పుడో ఎందుకు ? ఎల్లుండికల్లా రానూ ?" అంటూ మోహన్ వీడ్కోలు పుచ్చుకున్నాడు.

* * *

సాయంత్రం ఆరుగంటలు దాటింది. దల్లగాలి తిరిగింది. శేఖర్ పారంగుడు టీపాసి వద్దామని బయ



# అయిదు రెళ్ళు

శ్రీరాజు......

కొన్ని దూరం నడిచాడోలేదో కాళ్ళకు సడన్‌గా బ్రేకుపడింది. గుండెలు అవిసిపోయేంతటి కేకలు—

సందు ఇంచుమించు నిర్మానుష్యంగా ఉన్నది. సందు మొగలోనుంచి ఒకమనిషి, కుక్క పోటీపడుతూ పరుగులెత్తటం కనిపించింది. రయ్యిమంటూ దూసుకువస్తున్న మనిషిని అందుకోవాలని కుక్క వాయువేగ మనోవేగంతో పరుగులెత్తు తున్నది. ఆ దృశ్యాన్నికాస్సేపుచూసి ఆనందించేలోగా శేఖర్ వెనక్కి పడ్డాడు.

రోడ్డుదేవాలయానికి శేఖర్‌బుర్రనే టెంకాయగా సమర్పించు కున్నాడు— రొమ్ముమీద అమాంతంపడ్డ దో బరువు!..శేఖర్ ఒక్కక్షణం అప్పచ్చిలా అణిగిపోయాడు. ఇంతలో శేఖర్ మీదపడిపోయినా యన లేచి వళ్ళు దులుపుకుని శేఖర్‌ను చెయ్యిపట్టుకుని లేవదీశాడు. శేఖర్‌లేచి కూర్చుని తలతడుముకున్నాడు. చిట్లిపోయిం దేమో అనుకున్నాడుగాని గట్టిబుర్ర బొప్పికట్టి ఊరుకున్నది. ఇంతమర్యాదచేసిన ఆ పెద్దమనిషి శేఖర్ ముఖంవంక తేరిపారచూసి ఉబ్బితబ్బిబ్బై పోయాడు.

"అరె !మీరా ? వెదకబోయినతీగ కాలికి తగిలి నట్టు....."

శేఖర్ షర్టుకి. చేతులకుఅంటుకున్న మట్టిదులుపు కుంటూ కొరకొరా చూశాడు.

"కాలికి తగిలినట్టు అంటారేమిటి అమాంతం మీద పడి పోయి ?....................."

"క్షమించాలి!...అమ్మయ్యా ! ఈ కుక్కొకటి నా ప్రాణానికి !" అంటూ అతను భయంగా శేఖర్‌ను పట్టుకున్నాడు. కుక్కతోకాడించుకుంటూ శేఖర్ పక్కకొచ్చి నిలబడింది. శేఖర్ ఒక్క ఉదుటున పైకి లేచాడు.

"ఊర్వశీ!" అంటూ క్రిందకు వంగి దాన్ని ఆప్యాయంగా నిమిరాడు.

శరణుజొచ్చిన ఆసామి ఇంకా భయంగాచూస్తున్నా శేఖర్‌కు నవ్వొచ్చింది, జాలేసింది.

"ఇది నా పెట్ లెండి! నేనుదగ్గరుండగా మిమ్మ ల్నేమీ చెయ్యదు—" అంటూ అభయమిచ్చాడు.

శేఖర్ నుదిటిమీద టకటకా కొట్టుకుంటున్నాడు. నన్నుగా, రివటలా ఎక్కడోచూసిన జ్ఞాపకం !.....ఆ రోజు హాల్లో తను కిళ్ళీషాపు దగ్గర.......

"మీరు.....మీరు......."

"నా పేరు మోహన్ !"

శేఖర్ మాటలు తడుముకున్నాడు.

"ఇదివరకోసారి మిమ్మల్ని సినిమాహాల్లో చూసిన జ్ఞాపకం..........."

"అక్షరాలా నిజం !..నేను క్షమార్పణ చెప్పుకో వాలని వచ్చాను—"

శేఖర్ నిలువునా ఆశ్చర్యపోయాడు. ఇంతకు ముందు కనీసం మాట్లాడుకున్నైనా ఎరుగరు. క్షమా పణేమిటి ?

"శారదను మీరు పెళ్ళిచేసుకోవాలి !...."

శేఖర్ ఉలిక్కిపడ్డాడు. శారద అతనికెలా తెలుసు? శారదను తను పెళ్ళి చేసుకోనని ఇతనితో ఎప్పు డన్నాడు ?

"అది నాస్వంత విషయం..అవన్నీ మీకెందుకు?" అంటూ కోపగించుకున్నాడు శేఖర్.

"ఆ ఆకాశరామన్న ఉత్తరం నేనే రాశాను—"

శేఖర్ తృళ్ళిపడ్డాడు. ఇదేమిటి? కలా ? నిజమా? ముక్కూ మొహంతెలియని మనిషికి తనేం అపకారం చేశాడు ?

మోహన్ తడబడుతూ చెప్పాలనుకున్నదేదో చెప్పే శాడు.

"మీరు కళని చేసుకుంటారేమో అని భయం వేసింది. సుధాకర్, కళ ప్రేమించుకున్నారు. అందు కని మీకలా ఉత్తరం వ్రాశాను... కాని ఒక్క పొర పాటు జరిగి పోయింది. ఉత్తరంలో కళ అని రాయటానికి బదులు మరదలని రాయటంలో మీరు మరోలా అనుకున్నారు. నిన్ననే నాకు నా పొరపాటు తెలిసి వచ్చింది.... మీరు శారదను చేసుకోకపోతే నేను .... నేను .... "

ఆపైన మాటలు తట్టక మోహన్ దిగులుగా చూశాడు.

శేఖర్ సంతోష సంభ్రమాలతో తలక్రిందు లయ్యాడు. గుండె రాయి చేసుకుని క్షణ మొక యుగంగా గడుపుతున్న సమయంలో మోహన్ దేవుడిలా ప్రత్యక్షమై తనను రక్షించకపోతే ఇద్దరి బ్రతుకులు నిష్కారణంగా నాశన మయ్యేవి. అటు పోయిన ఊర్వశిని కూడా వెంటబెట్టు కుని వచ్చాడు. శేఖర్ ఆపలేనంత ఆనందంతో మోహన్ని కావలించుకున్నాడు. ఊర్వశి ప్రేమగా శేఖర్ కాళ్లకు అడ్డాలు పడింది.

శేఖర్ కౌగలినుండి బైటపడ్డాక "మరి నేను సెలవు తీసుకుంటాను ...." అన్నాడు నమ్రతగా.

"మా యింటికి రాకుండా ఎలా వెళ్లిపోతారో చూస్తాను !" అంటూ శేఖర్ మోహన్ చెయ్యి పట్టుకుని లాక్కెళ్లాడు ఊర్వశిని కూడా వెంట తీసుకెళ్తూ.

మోహన్ని చూసి కళ సుధాకర్‌ను చూసినంత సరదా పడింది.

"ఎలా ఉన్నారు ?" అని ఆప్యాయంగా పలక రించింది.

శేఖర్ పేరు పేరునా ఇంట్లో అందరినీ పరి చయం చేశాడు ...... చిత్ర మోహన్ వంటి మనిషిని అనుమానించినందుకు మనస్సులోనే క్షమా ర్పణలు చెప్పుకున్నది. రెండు మూడు రోజు లుండి వెళ్లమని శేఖర్, తతిమావాళ్లు చాలా బల వంతం చేశారు. కాని మోహన్ వినిపించుకోలేదు. మర్నాడు మెయిల్లో మద్రాసుకు బయల్దేరాడు.

వచ్చిన పని సులువుగా, జయప్రదంగా జరిగి పోయింది. తను శారద, శేఖర్ల పాలిట విలన్‌గా తయారైనట్టు గీత శేఖర్ సంగతి చెప్పేంత వరకు తనకు తట్టనేలేదు. ఏమైతే నేం ? ఇప్పు డంతా సవ్యంగా పరిష్కారమైంది.....

మోహన్ తృప్తిగా కదులుతున్న రైల్లో నుంచి చేతులూపుతూ దిగబెట్టడాని కొచ్చిన శేఖర్‌కు వీడ్కోలు చెప్పాడు.

ఇంటికి వెళ్లగానే శేఖర్ శారదకోసం వెదికాడు. మోహన్ వెళ్లాక తన కిప్పుడు తీరిక చిక్కింది...... శారద కిటికీలోనుంచి దూరంగా చూస్తూ ఏదో ఆలోచిస్తున్నది. పాపం ! తను శారదను ఎంత బాధపెట్టాడు ! ఈ కొద్ది రోజులకే శారద బాగా చిక్కిపోయింది .... తను మాత్రం ? మోహన్ రాకతో కొండంత సత్తువ వచ్చింది కాని లేక పోతే తను కూడా శారదలానే దిగులుగా, నీరసంగా....

శేఖర్ వెనకాలే వెళ్లి శారద భుజాలను ఆప్యా యంగా నొక్కాడు. శారద బెదురు చూపులు చూస్తూ ఇటు తిరిగింది.

శేఖర్ శారద చుబుకాన్ని పైకెత్తి "మామ య్యకి ఉత్తరం రాస్తున్నాను. మనిద్దరికీ పెళ్లి చెయ్యమని—" అన్నాడు.

నమ్మలేనట్టు చూస్తున్న శారద కళ్లల్లోకి చూస్తూ "నిజం శారదా ! .... నేనంటే నీ కిష్ట మేనా ?" అనడిగాడు.

"పో బావా !" అంటూ శేఖర్‌ను చేత్తో వెనక్కి త్రోసి తప్పించుకుని పారి పోయింది శారద.

ఆ సాయంత్రం శేఖర్ కళ వంటరిగా ఉన్నప్పుడు చూసి "నేను శారదను చేసుకుంటాను కళా !" అన్నాడు.

కళ కళ్ళు పెద్దవిచేస్తూ "నిజంగా ?" అనడిగింది.

శేఖర్ సంగతంతా చెప్పి "మోహన్ నిజంగా దేవుడిలాంటివాడు !" అన్నాడు.

"అవును! చాలా మంచివాడు—" అనుకుంది కళ

(సశేషం)



# అతడి నిజాయితీ

39 వ పేజీ తరువాయి

రంగనాధరావుగారు చటుక్కున దానిలో ఉన్న తన పర్సుమీద చేయి వేశారు. కొయ్యలా బిగుసుకుపోయిన చేత్తో దానిని పక్క జేబులో పడేసుకున్నారు.

"ఏంలేదు అవధాని .... ఏంలేదు .... తరువాత చెబుతాను నీకు ....!" అంటూ తడబడుతూ లేచి నిలబడ్డారు. త్వరత్వరగా కుర్చీమీద వేసిన కండువాను భుజంమీద పడేసుకున్నారు.

ఏదో తెలియని లోకంలో నడుస్తున్నట్లుగా రోడ్డుమీదకు అడుగులు వేశారు.

అవధానిగారికి ఏమీ అర్థంగాలేదు. హుషారుగా ఏదో చెప్పాలన్నట్లుగా పిల్చి, ఉన్నట్లుండి ఎందుకూ అయిపోయారో, ఎక్కడికి అలా చెప్పా పెట్టకుండా వెళుతున్నారో అర్థంగాక రంగనాధరావుగారు వెళుతున్నవైపే చూస్తూ ఉండిపోయారు.

ఇది చాలా విచిత్రంగా ఉంది!—తను పోయిందనుకుంటున్న పర్సు పోలేదా? .... దాని నితను ఆఫీసులో డ్రాయర్లో మర్చిపోయాడా?— అలా గుర్తుకొచ్చినప్పుడల్లా ఆయనకేదో పాతాళంలోకి జారిపోతున్నట్లే అనిపించింది!

మరి అతడు రెండు వందల యాభై రూపాయలు ఎలా పంపించాడు—ఎందుకు పంపించాడు?—రంగనాధరావుగారికి తల తిరిగిపోసాగింది.

తానేదో అయోమయ ప్రపంచంలో పడి దారి తెన్నులు తెలియనివాడిలా గిజగిజ లాడిపోయారు!

నిజమే!—చిన్న జీతాలు వంచి మొఖం కడుక్కొని, మంచినీళ్లు త్రాగటానికి వెళ్లబోతూ దాంట్లో పెట్టినట్లే ఉన్నాడు .... కనీసం తను బస్సు ఎక్కే ముందైనా జేబులో పర్సు ఉందో లేదో చూసుకోవాల్సింది— ఇంత గొడవా జరిగి ఉండేదే గాదు!

ఒకవిధంగా సహజంగా—తన జేబులోనా పర్సు లేదు— తన వెనుక కిక్కిరిసిన బస్సులో ఓ పచ్చి దొంగ ప్రయాణం చేశాడు .... అంతకంటే ఇంకేం కావాలి .... పర్సు పోయిందనుకోవటానికి— అతడే తీసుకున్నా డనుకోవటానికి!

కాని— తను చాలా తొందరపాటు పడ్డాడేమో ననిపిస్తోంది.....అసలు తన ఆలోచనలన్నీ ఒక బాటలోనే నడిచినయి— కనీసం అతడుగాక మరెవరయినా తీసి ఉండవచ్చునని గూడా తను ఒక్కసారీ అనుకోలేదు!

అవును— ఏలా అనుకుంటాడు? ఎక్కడున్నది అవకాశం?—నెల కష్టార్జితం మాయ మవ్వటంతో ముందు జీవితం కటికచీకటిలో కనబడింది ..... తను తత్తరపడటం, దిగులుపడటంతోటే సరిపోయింది!

ఇప్పటికే రాత్రి సంఘటన గుర్తుకొస్తుంటే గుండె దడదడ లాడుతూనే ఉన్నది!

ఇప్పుడు రంగడికి తన మొఖం చూపించాలంటే సిగ్గుగా ఉన్నది రంగనాధరావుగారికి .... ఏదో ఇబ్బంది పడుతున్నట్లుగా అనుకోసాగారు.

ఏమైనా—వెళ్లక తప్పదు. రాత్రి తను చేసిన పనికి, అతడిమీద తను అనుమానపడిన తీరుకి అతడు ఎంతగా బాధపడుతున్నాడో?

# అతడి నిజాయితీ

[illegible] జరిగినదానికి తనలో తాను బాధపడుతున్నాడు— అనవసరంగా ఒక నిరపరాధిని (ఈ విషయంలో) అనుమానించినందుకు!

అసలు ఇంతకీ తెల్లవారేయప్పటికి రెండువందల యాభై రూపాయలు అతడు ఎక్కడనుండి తెచ్చాడు?

ఎలా?

అయినా.....నిన్న మొదటి తారీఖుగా — ఎవడి బాపతు?!

నవ్వు వచ్చింది రంగనాథరావుగారికి.

చాలా గమ్మత్తుగా ఉన్నది ఇదంతా!

ఆయన రంగడుంటున్న ఇంటి సమీపంలోకి వచ్చేటప్పటికి ఆయనలోని ఎంత ఆలోచనలన్నీ మాయమయినయి — మనిషిని తెలియని సిగ్గు ఆవరించింది!

రంగడికి ఏం చెప్పాలి. ఎలా చెప్పాలి అనే విషయంమీద ఆలోచనలు ముసురుకున్నాయి.

తను అతడిని మానసికంగా కష్టపెట్టినందుకు క్షమాపణ కోరుకోవాలి గూడా!

పడిపోయిన మొండి గోడల నడుమనున్న రంగడి ఇంటి ముందుకు వెళ్ళారు.

తలుపులు దగ్గరకు వేసిఉన్నాయి.

గుండె వేగంగా కొట్టుకుంటోంది.

“రంగడూ!......”

“......”

“రంగడూ......!” కాస్త కంఠం హెచ్చించారు.

ఆ పిలుపుకు రంగడు ఉంటున్న భాగపు తలుపైతే తెరుచుకోలేదుగాని, పక్క భాగపు తలుపు తెరుచుకుంది. అందులోనుండి గళ్ళలుంగీ కట్టుకున్న మధ్య వయస్కుడొకడు బయటకువచ్చి హెడ్మాస్టరు గారిని చూస్తూనే ఆశ్చర్యపోతూ “మేస్టరుగారా! మీరా?” అన్నారు.

“రంగడు ఇంట్లో లేడా?”

“లేదు మాస్టరు......తెల్లవారుజామునే కుటుంబాన్ని తీసుకొని ఈవూరు విడిచి వెళ్ళిపోయాడు!... మీకేదో ఉత్తరం గూడా ఇయ్యమని ఇచ్చి వెళ్ళాడు. ఇంకా స్కూలుకుపోయి ఇద్దామనుకుంటున్నాను......” అంటూనే వెనక్కు తిరిగి లోపలి కెళ్ళాడు.

మేష్టరికి శ్వాస ఆగిపోతుందేమోనన్నంత భయం వేసింది....ఇదేమిటి....మరుక్షణంలోనే చేయి జేబులోని పర్సును, పర్సులోని డబ్బును పరిశీలించేయసాగింది!

అతడు లోపలనుండి కాగితం తెచ్చి ఇచ్చాడు. ఆయన ఆదుర్దాగా విప్పి చదువుకోసాగారు......

“మాస్టరూ!

నాలో ప్రత్యేకంగా ఈ ఉత్తరం వ్రాయటానికి ఏ కోరికా లేకపోయినప్పటికీ, ఏదో నాకు తెలియని శక్తి నాచేత వ్రాయిస్తోంది.

సంఘం అంటే అంతే మాస్టరూ!.....అంతే!

ఈ ఉత్తరం నేను ఎవరినీ విమర్శించే ఉద్దేశ్యంతో వ్రాయటంలేదు.....నాలోని బాధను కాగితంమీద పెడుతున్నాను.

నేనూ కాస్తో కూస్తో చదువు వెలిగించాను.... కాని ఒకసారి పొరబాటున బురదలో కాలు వేయటం జరిగింది.....దానిని ఈనాటికీ నేను తీసుకోలేకపోతున్నాను ...... ఒక్కొక్కసారి తీసుకోటానికి ప్రయత్నించినా పరిస్థితులు తిరిగి దాంట్లోనే తోసేస్తున్నాయి....నేనేం చేయను మాస్టరూ!.... ఒకసారి మీతో అన్నట్లుగా నా జీవితం ఒక దుర్భరం!...

మీకు తెలియకపోవచ్చు.....మీ పర్సును నేను మాత్రం తీయలేదు.....నాకు తెలిసినంతవరకు ఆ బస్సులో మీ పర్సు తీసుకోగలవాడూ లేడు... మరేలా పోయిందో నాకూ అగమ్యంగానే ఉన్నది......లేకపోతే అది అంతకుముందే పోయి ఉండవచ్చు!

ఏమైనా కానీయండి...... ఈ ప్రదేశాన్ని వదిలితేనైనా కొన్ని రోజులుగా కొత్త జీవితంలో కాలు పెడదామనుకుంటున్న నాకు విముక్తి లభించవచ్చు!......అందుకనే ఈ వూరిని వదిలిపెట్టాను...

మీరు నా పిల్లవాడికి రెండు సంవత్సరాలనుంచీ చదువు చెబుతూ ఎంతో సహాయం చేశారు.... ఈ రోజుల్లో ఒక పైసా జీతం లేకుండా గడపటం ఎంత దుర్భరమో నాకు తెలుసు మాస్టరూ!.... అందుకే మీరు పోగొట్టుకున్న రెండు వందలయాభై రూపాయలు నా వాడి చదువుకు ప్రతిఫలంగా పంపాను!

ఈ వూరిని విడిచి పోతుంటే నాకు ఒక్కటే తృప్తి మాస్టరూ!.....ఒకరికి కష్టంలో ఆదుకోగలిగాననే— అందునా అది పాపిష్టి ఆదాయంతో కాదనే!.....

సెలవ్ మాస్టరూ......రంగడు.



# కల్పన

16 వ పేజీ తరువాయి

కనులు గంది. సన్నని చిన్న ముక్కు గంది. బుల్లి నోరు. చిన్న వదనం. తీర్చి దిద్దిన అవయవ సౌష్ఠవంతో, సన్నని నడుముతో పొడుగాటి జడ, నీలం రంగు చీరతో, నీలం రంగు రవికతో వయ్యారంతో మెరిసి అతని ఉత్సాహాన్ని రేకెత్తించింది.

గబగబ ముందుకు పరుగెత్తాడతను. కుడి వైపుకు మళ్ళీ ఒక క్షణం ఆగాడు. గజ్జెల సవ్వడి వినిపించలేదు. ఊపిరి బిగపట్టి విన్నాడు. ఊపిరి బిగబడితే గజ్జెల శబ్దం వినిపిస్తుందని వేదాలు వక్కాణించడం లేదు. ముందుకు చూశాడు. వెనక్కు చూశాడు.

ముందర మెట్లు కనిపించాయి. దకదక మెట్లెక్కాడు. పైమెట్టు కాలికి చల్లగా తగిలింది. విశ్వనాథరావుకి ఒళ్ళు గగుర్పొడిచింది. 'పిరికిబంద!' చటుక్కున వంగి చేతితో తడిమి చూశాడు. వర్షపు నీటితో తడిసిన గడ్డి— నేల మీద విస్తరించి కొట్టాడు. పైమెట్టెక్కి అక్కడి నుంచి చూస్తే, మరేదీ కనిపించలేదతనికి.

టార్చి వెలిగించాడతను. ఎదురుగ్గా— చూసి, ఒకసారి కళ్ళు మూసుకుని తెరిచాడు విశ్వనాథరావు. అబ్బ! అతను స్తంభించి పోయాడు. మరొక్క అడుగు ముందుకు వేస్తే— ఏముంది! తిన్నగా ఒక సొరంగంలోనికే అతను పడి ఉండేవాడు. ప్రమాదం తప్పింది. టార్చి వెలుగులో అతను చుట్టూ చూశాడు. దూరంగా సవ్వడి వినవస్తూ ఉంది. ఎడమ చేతి వేళ్ళ మధ్య లైట్ ఆర్పి, దరదర ముందుకు పరుగుపెట్టాడు. ఎంతోదూరం పరుగెపెట్టినా నిశ్శబ్దంగా, నిశ్శబ్దంగా ఉన్నది తప్ప, మరేమీ కనిపించలేదు.

గజ్జెల సవ్వడి ఏమైంది? ఇదంతా తన భ్రమేనా? ఊహించుకుని, వ్యర్థంగా తను ఇక్కడ తిరుగాడుతున్నాడా? దెయ్యాల కథల మాదిరి తను ఒక ప్రేతాత్మ ప్రభావానికి లొంగిపోయి తన శక్తిని కోల్పోతున్నాడా? చిత్రంగా ప్రశ్న వెనుక ప్రశ్న మొలకెత్తుతోంది అతని హృదయంలోను.

చిట్ట చివరకు ఒక గదిలో అతను నిలబడి, బ్యాటరీ లైట్ వెలుగులో గదిని పరిశీలించాడు. ఆ గదిలో గోడ గోడకు వేలాడుతున్న ఒక అద్దం తప్ప, మరే సామాన్యా లేదు. ఆ అద్దంలో విశ్వనాథరావు తన ముఖం చూసుకున్నాడు. అబ్బ! ఎట్లా ఉంది తన రూపు!? — తనకే భయం గొల్పుతూ ఉంది. జుత్తంతా చెదిరి, బట్టలన్నీ అక్కడక్కడ తడిసి, చిరిగి... ఖూనీ కోరు రూపం ప్రత్యక్షమైంది అద్దంలో ఏదో సాహసిక నవలలో రాజకుమారుడిలా పకపక నవ్వుకున్నాడతను. జేబులో నుంచి దువ్వెన తీసి చకచక తల దువ్వుకున్నాడు. సర్వమూ మరిచి ఒక ఈలపాట కూడా పాడుకున్నాడు.

వెనక నుంచి ఎవరో సన్నగా నవ్వుతున్నారు. చటుక్కున వెనక్కు తిరిగి చూశాడు. నవ్వాగిపోయింది. ఎవరో స్త్రీ పరుగు పెడుతున్నట్లు గజ్జెల సవ్వడి మాత్రం వినబడింది.

“ఎవరది?” అరిచాడు విశ్వనాథరావు.

ఎవరో స్త్రీ పరుగుపెడుతూ పకపక నవ్వుతూ ఉంది. “ఆగు” తిరిగి అరిచాడతను. అరుస్తూనే అతను ఆ వైపు పరుగు పెట్టాడు. ముందు గజ్జెల సవ్వడి— వెనుక విశ్వనాథరావు. ఒక గది నుంచి మరో గదికి— ఇట్లా పైన అంతస్తంతా పరుగులు పెట్టాడతను. గజ్జెల ధ్వని మెట్లు దిగుతూ ఉండగా విశ్వనాథరావుకు ఆయాసం వచ్చింది. కాళ్ళు పీక్కుపోతున్నాయి. ఊపిరందక వూపిరి రొప్పుతున్నాడతను.

మరి ముందుకు వెళ్ళలేనంత నిస్సత్తువతో అతను మెట్ల మీద కూలబడి పోయాడు. గజ్జెల శబ్దం ఏమైందో అతనికి తెలియదు. ఆయాసంతో ఒగరుస్తూ, కళ్ళు మూసుకుని ఒక్క క్షణం నిరాలోచనగా, నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఆ నవ్వింది ఎవరు? ఆ పరుగు పెట్టింది [illegible]? ఆమె [illegible] ఫక్కున నవ్వి, దూరంగా పారిపోతూ దాగుడుమూతలాడుతూండడంతో ఆమె ఉద్దేశ్యం ఏమిటి? ఇంతకూ ఆమె బ్రతికి ఉన్నదా? ఆమె ప్రేతాత్మ నిరాకారంగా ఈ కోట చుట్టూ తిరుగుతూ ఉందా?

దిక్కులదిరే విధంగా— దూరం నుంచి— ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. మెట్ల మీద నిలబడి ఒక్క క్షణం ఆ ఆర్తనాదం ఎవరిదా అని ఆలోచించాడతను. భయవిహ్వలయైన ఒక స్త్రీ సన్నని కంఠస్వరం అది. విశ్వనాథరావు ఒళ్ళు జలదరించింది. అతనికి భయాన్ని కలిగించే ఆలోచన లెన్నో తలా అతని మనో గగనంలో కదలాడింది. ఆ కంఠం ఎవరిదో అతనికి తెలుసు. అతనిలో ఆత్రం పెల్లుబికింది. వేగంగా మెట్లు దిగాడు. తను వచ్చిన దారినే బయటికి పరుగెత్తడం ప్రారంభించాడు. ఎంత వేగంగా పరుగెత్తాలన్నా అతని

ఉన్నారు. తేనెలొలికే వెనక్కి వచ్చేయాలని మనవిచేసి !" అంటూ హెచ్చరించింది.

"అయితే — సరే పోతే !" అంటూ —రంగాన్ని తరుమసాగింది సర్వమంగళం.

## 12

**"బంగారూ ! శరణు ! శరణు !" అంటూ సుందరాంగం సుడిగాలిలా వచ్చి బంగారు పాదాల మీద పడిపోయింది.**

బంగారు దాన్ని పైకి లేవనెత్తాడు. "భయంలే" అంటూ దాని వీపు నిమిరాడు. "అసలేం జరిగింది ?" అని అడిగాడు.

"పులిరాజు తరుముకు వస్తున్నాడు ! నా ప్రాణాలు రక్షించు...." అన్నది సుందరాంగం. దాని గుండె ఇంకా వేగంగా కొట్టుకుంటూనే ఉంది.

.... రొప్పుతూ వస్తున్న పులిని చూశాడు బంగారు. పులి జింకను సమీపించడానికి వీలులేకుండా —ఆవులన్నీ చుట్టూ చక్రాకారంలో నిలబడ్డాయి. తోకలు పైకెత్తి, తలలు ముందుకు వంచి, పులికి తమ వాడి కొమ్ములని చూపాయి. కుక్కలు నాలుగూ —అవసరమైతే పులిని అడ్డుకోడానికి సిద్ధపడ్డాయి. పులి దగ్గరికి వచ్చేసింది.

"మిత్రమా ! కుశలమే గదా ?.... నా కన్నులు గప్పి పారిపోతున్న ఈ జింకను పట్టుకున్నావు. నీకు నా కృతజ్ఞత !" అంటూ జింకను సమీపించ బోయింది.

.... కుక్కలు భీకరంగా మొరిగాయి. ఆవులు భయంకరమైన రంకెలు వేశాయి. "పులిరాజా ! ఆగు !" అన్నాడు బంగారు.

"నీకు ఈ జింకను ఇవ్వబోవడం లేదు. ఇది ప్రాణ రక్షణ కోసం నన్ను శరణువేడింది. దీనికి అభయ మిచ్చాను. నేను నా ధర్మం తప్పను."

"బంగారూ ! ఈ జింక నాది ! నా సొమ్మును నీవు అపహరిస్తున్నావు. ఇంత దౌర్జన్యం పనికిరాదు." **అంది పులి.**

**"పులిరాజా ! నేను దౌర్జన్యం చేయడం లేదు. నీ సొత్తును అపహరించడం లేదు. నువ్వు ఈ జింక ప్రాణాలు తీయాలనుకున్నావు. నేను దీనికి ప్రాణ భిక్ష పెట్టాను. ఈ జింక నీ సొట్లా అవుతుంది ?"**

"బంగారూ ! ఇది నా వ్యక్తిగత విషయం. ఇందులో నీ జోక్యం అనవసరం. నా జింకను నా కిచ్చేయి."

"పిచ్చి మొండివాదం ! నీ వ్యక్తిగత విషయాలలో నేను జోక్యం కల్పించుకుంటున్నానా ? అన్యాయానికి బలికావడానికి సిద్ధంగా ఉన్న ఈజింక నా ఆశ్రయాన్ని కోరింది. ఇక— అన్యాయం దానికి జరిగినా, నాకు జరిగినా ఒక్కటే !.... కనుక మన స్నేహానికి భంగం కలుగకుండా ఉండాలంటే ఈ జింక మాట మరచిపో !" అన్నాడు బంగారు.

"నా సొత్తు కాజేయడమే గాక— నన్ను తప్పులు పట్టుతున్నావా బంగారూ !.... సరే ! ఈ జింక యొక్క ప్రాణాన్ని ఏదో విధంగా రాబట్టుకో గలనులే !" అంటూ పులి నీలికొండల వైపు వెళ్ళి పోయింది.

సుందరాంగం ఆనందానికి అంతులేదు. అది కృతజ్ఞతా సూచకంగా బంగారు పాదాల ముందర కూర్చున్నది. పులిరాజా దుర్మార్గానికి చాలా జింకలు ఎలా బలి అయినదీ— చెప్పింది. అంతలో అక్క

## బంగారు నడచిన బాట

(11 వ పేజీ తరువాయి)

డకి చిట్టికోతి వచ్చింది.

"ఏమిటయ్యా సుందరాంగం ? బ్రతికే ఉన్నావా ! నీ పెక్కుబలం నిన్ను కాపాడింది. అదృష్ట వంతుడివి !" అన్నది.

"కాదు మిత్రమా ! నా ప్రాణాలు కాపాడింది— బంగారు ! నా కోసం ఇతడు పులితో కయ్యాన్ని కూడ తెచ్చుకున్నాడు. నిజంగా ఇతనికి నేను జీవితాంతం ఋణపడి ఉన్నాను." అన్నది — సుందరాంగం.

"సర్వ మంగళం వంటి దుష్టుడితో కయ్యం ఏ నాటికైనా ఏర్పడేదేలే !.... దాని చరిత్ర ఇంకా మన బంగారుకు తెలియనట్లున్నది...." అంటూ చిట్టికోతి అన్ని సంగతులూ అతనికి చెప్పింది. టక్కు టమారం టక్కులు, అయిదు ఆవులు కైలాసానికి చేరుకొన్న వైనమూ కూడ తెలిపింది.

"ఆ ! వాటిని టక్కుటమారం చంపించిందా? అయ్యో !" అంటూ బంగారు విలపించాడు.

"ఆ నాడు మేము ఏమన్నాము? ఆ జిత్తులమారి నక్క అనుకొన్నంత పనీ చేసేసింది. అది ఈసారి కనిపించాలి— మా తడాఖా చూపిస్తాం." అన్నాయి కుక్కలు క్రోధావేశంతో.

"ఊరుకోండూరుకోండి !" అన్నాడు బంగారు. "దాని జోలి మనకెందుకూ ? దాని ఆవుల్ని అది ఏమైనా చేసుకుంటుంది. ఆ పాపం దానిదే !...."

ప్రొద్దు గ్రుంక బోతుండగా— ఆవుల మందను తోలుకుని బంగారు ఇంటి ముఖం పట్టాడు. సుందరాంగం, చిట్టికోతి కూడ అతన్ని అనుసరించాయి.

పారిపోయి వచ్చిన సుందరాంగానికి ఇప్పుడు బంగారు ఇల్లే ఆశ్రయమైంది. తనవారెలా ఉన్నారో అన్న విచారం తప్ప, దానికి మరో లోటు లేదు. దానికి అన్ని సదుపాయాలూ అమర్చి పెట్టాడు బంగారు. **ఇలా రెండు రోజులు గడిచాయి.**

**మూడో రోజు** ఎప్పటిలాగా బంగారు ఆవుల మందను చిట్టడవిలోకి తోలుకు వెళ్ళాడు. ఆవులు మేస్తున్నాయి. కుక్కలు పరుగులెత్తి ఆడుకుంటు న్నాయి. బంగారు కాస్సేపు పిల్లనగ్రోవి వూదాడు. చెట్టు క్రింది చల్లని నీడలో అతనికి తెలియకుండానే నిద్ర పట్టేసింది.

హఠాత్తుగా అతనికి మెలకువ వచ్చింది. ఆవు లన్నీ భయపడిపోయి బిగ్గరగా రంకెలు వేస్తున్నాయి. కుక్కలు తోకలు ముడుచుకుని ముందరికీ వెనక్కీ తిరుగుతూ మొరుగుతున్నాయి. ఏదో విపత్తు జరిగి ఉంటుందనుకున్నాడు బంగారు. "ఏమిటి ? ఎందు కలా కంగారు పడిపోతున్నారు ?" అని అడిగాడు.

**"పులి ! పులి వచ్చింది ! ఒక ఆవు మీదికి విరుచుకు పడి చంపివేసింది !" అన్నాయి కుక్కలు.**

ఈ మాట వినగానే బంగారు తల దిమ్మెక్కి పోయింది. "ఏదీ ? ఎక్కడ" అన్నాడు అతడు ఆత్రంగా.

"ఇంకా ఎక్కడుంది ? చచ్చిన ఆవును ఎత్తుకుని వెళ్ళి పోతున్నది !"

పులి ఆవును చంపిన స్థలం చూశాడు బంగారు. అక్కడ చిన్న రక్తపు మడుగు ఏర్పడింది. అక్కడి నుండి పులి వెళ్ళిపోయిన దిక్కుగా రక్తపు మరకలు, పులి కాలిగుర్తులు కనిపిస్తున్నాయి.

ఈ ఘోరం చూచి బంగారు గుండె తరుక్కు పోయింది. అతడు గబగబా పులి వెళ్ళిన వైపుగా కొంత దూరం వెళ్ళాడు. "ఓ పులి రాజా ! నీ కిది న్యాయంకాదు. నేను, నా ఆవులు నీకేం అపకారం చేశాము? ఇంత అక్రమమా? ఇంత దౌర్జన్యమా?" అంటూ కేకలు పెట్టాడు.

పులి బదులు పలుకలేదు. దట్టంగా ఉన్న పొదలూ, చెట్ల చాటున అది కంటికైనా కనిపించ లేదు. దాన్ని కలుసుకోవాలని బంగారు పిచ్చివాడిలా పరుగు తీశాడు. చిట్టికోతి అతనికి ఎదురుపడి వారించింది. "బంగారూ ! వెనక్కి వెళ్ళిపోదాం రా ! పులి దగ్గర నీ మంచితనం ఎందుకూ పనికిరాదు. అది నిన్ను చంపివేసినా చంపివేయవచ్చు !...."

బంగారు బరువుగా అడుగులు వేసుకుంటూ మరలి వచ్చేశాడు. ఈ సంఘటన అతని హృదయాన్ని కలచివేసింది. "ఈ పులి స్నేహమంతా వట్టి బూటకమేనా ? దీని మాటలూ, చేతలూ అన్నీ నాటకమేనా ? దీని మాయదారి వేషాలకు నేను మోసపోయానే ! అయ్యో ! కాంతి మాత్రం కూడ కాలదన్ని, అది ఇంతటి ద్రోహానికి పాల్పడిందే ! నా గంగిగోవును నిలువునా చంపివేసిందే !" అంటూ విలపించాడు.

(సశేషం)





**అమూల్ వెన్నతో ఇంటి వంటలు అతి రుచికరం.**






అమూల్ వెన్నతో మీరు ఎన్నో పిండివంటలు చేయవచ్చునని తెలిసుకొన్నప్పుడు ఆనందపరవశులగుదురు. అమూల్ వెన్నతో వండుటవలు కలిగే కమ్మని సువాసనను ఆనందంగా ఆస్వాదించండి— అమూల్ వెన్నతో కేకులను, బిస్కట్లను తయారు చేయండి మరియు టోస్ట్స్, పూరీ దోశా వండండి. జ్ఞాపకముంచుకోండి. అమూల్ వెన్నతో వండిన ప్రతి పదార్థమూ అధిక పుష్టికరం కూడా. శుద్ధమైన, తాజా మీగడతో కూడిన అమూల్ వెన్న అయిదుగంటలలోనే పాలు పిత్తు నుండి వెన్న ఫ్యాక్టరీగా డైరీ యందు చిలికి తయారు చేయబడినది. శక్తిదాయకమైనది—పెరిగే పిల్లలకు చాలా పుష్టిమైన ఎ, డి. విటమిన్లను కలిగియున్నది.

డైరీలో అపుడే...
తయారైన శుద్ధక్రీమ్...

# అమూల్
# వెన్న

అమూల్ మీఆహారమం
తటికీ అమూల్యమైన అధిక
పుష్టికరమగు మంచి ఫలిత
మును కలిగించుచున్నది.

ఖైరా కొ-ఆప్. ఉత్పత్తి—అమూల్యమైనది.

ఖైరా డిస్ట్రిక్టు కొ-ఆపరేటివ్ మిల్కు ప్రొడ్యూసర్సు యూనియన్ లిమిటెడ్, ఆనంద్.

CAS/KMP.32 TEL

(CAS/KMP. 32 TEL



తన జలుబుతో నిర్మాతలముక్కు పిండినా, ఋణముంచుకోకుండా నటించిన ఎలిజబెత్ టేలర్ క్లియో కిరీటంలో...

# తెర మీది - తెర వెనుక కథలతో 'క్లియోపాత్రా' చిత్రసమీక్ష

ట్వెంటియత్ సెంచురీ ఫాక్స్ టాడ్ఏ ఓ డబ్బాయి మి.మి. ల పెద్ద[తెరమీద] నిర్మాణం: ప్రొడ్యూసర్ వాల్టర్ వాంజెర్, దర్శకత్వం స్క్రీన్‌ప్లే: జోసఫ్ ఎల్. మాంకీవిక్జ్, క్లియోపాత్రాగా ఎలిజబెత్, సీజర్‌గా రెక్స్ హారిసన్, మార్క్ ఆంటోనీగా రిఛర్డ్ బర్టన్ [లక్ష్మీశైన్], ఆక్టేవియన్‌గా రోడీమాక్ డొవాల్‌లు నటించిన వాళ్ళల్లో ముఖ్యమైన వాళ్ళు.

## తెర వెనుక:

అరవై చిత్రాల అనుభవం, పాతిక సంవత్సరాలుగా మననును. పీడించిన కోర్కెగల వాల్టర్ వాంజర్ క్లియోపాత్ర చిత్ర నిర్మాణానికి నాలుగేళ్ళు తీసుకున్నాడు. సుమారు పద్దెనిమిదిన్నర కోట్ల రూపాయల వ్యయంతో 63 జూలైకి దీన్ని పూర్తిచేసేసరికి 'మహాడు చెర్సుల పెళ్ళు తాగి తోడసి మాపెడు' అయింది. ఈ బ్రహ్మాండమైన చిత్రం 'నాయిక' చరిత్రకన్నా ఆ వేషం వేసిన కథా 'నాయిక' చరిత్ర మరింత విచిత్రంగా స్టార్ వాల్యూను పబ్లిసిటీని పెంచింది. కోట్లకి కోట్లు రూపాయలు ఒక చిత్ర నిర్మాణంలో ఎలా తగలడతాయో, ఆ తర్వాత అవే 'దండగలు' పబ్లిసిటీకి అనువుగా ఉండి ప్రేక్షకుల 'ముక్కు' పెలా పిండేస్తాయో ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను.

ఏభై లక్షలకికాని రానన్న ఎలిజబెత్ టేలర్ ఒక సంవత్సరం బేరసారాల తర్వాత కాంట్రాక్టు రాసుకుంది. అది ఇలా ఉంది. మొదటి పదహారు వారాలకి వారానికి 125 వేల డాలర్లు (సుమారుగా—5చేత హెచ్చు వేయండి రూపాయలు వస్తాయి)

ఆతర్వాత వారానికి ఏభైవేల డాలర్లు—ఇది గాక చిత్రంమీద రాబడిలో పది శాతం భాగస్వామ్యం, తనకి, పిల్లలికి అప్పటికేవున్న భర్తకి (ఈ నాలుగేళ్ళల్లో ఈమెకు ముగ్గురు భర్తలు మారారు) ఖర్చులకిగాను ఉత్తమశ్రేణి ఏర్పాట్లగాను వారానికి 3 వేల డాలర్ల భత్యం. స్క్రిప్టులో కొన్ని మార్పులు కూడా ఒక షరతు అనుకుంటాను. లండన్‌లో ఈ సినిమా తియ్యాలనుకున్నారు ('59). పీటర్‌ఫించ్ (సీజర్) స్టీఫన్ థాని అలెగ్జాండ్రియాని సెట్‌గా వెయ్యడానికి ఇరవైవేల ఘనపు టడుగుల కొయ్య, 142 మైళ్ళ మేరకు రాగల ఉక్కు గొట్టాలు, 8 ఎకరాల భూమి, 4 మైళ్ళ రైలు ట్రాక్, 300 గాలన్ల పెయింట్‌లతో సంభ్రమైన ఇళ్ళు కట్టాల్సి వచ్చింది. తాటిచెట్లు హాలీవుడ్ నుంచి, ఆకులు ఈజిప్టు నుంచి వచ్చాయి. చిత్రం అక్కడ పది వారాల షూటింగ్‌తో అంతకన్నా ఎక్కువపోల్లు క్లియోపాత్రాధారిణి లిజ్‌కి జలుబు చెయ్యడం—లండన్‌లో సూర్యుడు ఉదయించకపోడం—నిర్మాతల జలుబు అవిధంగా వదిలిపోవడం జరిగింది.

కాని 20 లక్షల డాలర్ల నష్టం తప్ప మరేం మిగల్లేదు. ఎలిజబెత్ టేలర్‌కి పదకొండుమంది ఎక్స్‌పర్ట్ డాక్టర్లు కలిసి కంఠంకోసి ఆపరేషన్ చేసేటంత జబ్బు చేసింది. 'చచ్చిపోయింద'న్నాయి కొన్ని పత్రికలు. చిత్రం లండన్‌లో మానేశారు. ఆ తీసినదంతా కాల్చేశారు. పటీ నటులలో 'నటి' ఇష్టంగా ఆంటోనీగా బర్టన్‌ని, సీజర్‌గా 'రెక్స్'ని తీసుకున్నారు. (స్టీవర్ హోవర్డ్ వెయ్యనన్నాడు) రోమ్‌లో 61 లో తిరిగి ప్రారంభించారు. ఎలిజబెత్ టేలర్ తన కేశాలంకరణకి వేరే సొంత ఆర్టిస్టు కావాలంది. లక్ష రూపాయల ఫీజు దినవారీ ఖర్చులు అడిగే తన డాక్టర్ కావాలంది—కంఠం మీద ఆపరేషన్‌వల్ల నల్లని మచ్చ ప్లాస్టిక్ సర్జరీకి 6 మాసాలు పట్టింది. చివరికి రోమ్‌లో అలెగ్జాండ్రియాలో, ఇతర చోట్ల చిత్రాని పూర్తి చేసేసరికి మొదట అనుకున్న డైరక్టర్, రచయితలు, నటులు అంతా పోయారు. చివరికి ఆఖరి దశలో ప్రొడ్యూసర్‌ని కూడా ఓసారి 'పీకే'శామన్నారు. ప్రొడ్యూసర్ రాసుకున్న బాధంతా పెద్ద 'హిట్' అయింది. చిత్ర నిర్మాణంలో ఎలిజబెత్ 'జలుబు' చెయ్యడం, అది నిర్మాతలకి వదలకొట్టిన 'జలుబు' జాస్తిగా ఉండటం ప్రధానాంశాలు అయ్యాయంటే అత్యుక్తి కాదు.

## చరిత్రలో

ఇక అసలు కథ: క్రీ. పూ. ఒకటో శతాబ్దంలో 39 సంవత్సరాలు జీవించిన క్లియోపాత్రా అందానికి, అందరి మొక్కులనే ఆశయానికి ప్రసిద్ధికెక్కింది. సీజర్‌ను 'జయించి' తన బిడ్డను రోమ్ అధిపతిని చెయ్యాలనుకుంది. సీజర్ హత్యానంతరం ఆ కోర్కె వమ్ము కావడంతో ఆంటోనీ ద్వారా అదే కాంక్షను నెరవేర్చుకోవాలనుకుంది కాని, ఈజిప్టు గోధుమలు, బంగారంతోపాటు ఈజిప్టు రాణిని కూడా దక్కించుకున్న "సీజర్" 'ఆంటోనీ', అనే రోమన్ లిద్దరూ రెండు రకాలుగా ఆమె కోర్కెను వమ్ముచేసి తమ రాజకీయ చాతుర్యాన్ని నిలబెట్టుకునారు—క్లియోపాత్రా ధైర్యసాహసాలకి, అందానికి చరిత్రచేసి, ఆత్మహత్య చేసుకుంది!

ఈ కథ ఆధారంగా రక రకాల కల్పనలతో రసపట్టుగల కథ అనేకం రాగల అవకాశం ఉంది కదా! ప్రస్తుత చిత్రంలో ఒక భాగం సీజర్—క్లియోపాత్రాగా, రెండోభాగం ఆంటోనీ క్లియోపాత్రాగా చూపించారు. బహుశా 'నటి' లిజ్ కోర్కెమీద కాబోలు, బర్టన్ (ఆంటోనీ) స్టార్ వాల్యూ పెంచి, 'పాత్ర' తను కూడా పెంచారు!

(అతను మంచి నాటకాల నటుడు దీంతో అతని రేటు రెట్టింపు అయింది)

చిత్రంలో ఎలా చూపించారో గమనించుగా ఆదే సన్నివేశంలో కథ వ్రాయడానికి ప్రయత్నిస్తాను: ''పాంపే''ని పట్టుకుందికి సీజర్ అలెగ్జాండ్రియా వెళ్తాడు. ఈజిప్టురాణి, క్లియోపాత్రా (ఆమె సోదరుడు) రాజా టోలమిల మధ్య వైరం పతాక సన్నివేశంలో ఉంటుంది. సీజర్‌కి 'టొలమి', పాంపే తల నరికేసి బహూకరిస్తాడు. సీజర్ తనకి అగతే పట్టకుండా జాగ్రత్త పడతాడు. క్లియోపాత్రా సీజర్ సాయం కోరుతుంది. అతని సాయంతో 'టొలమీ'ని, అనుయాయులని అంతమొందించి, ఈజిప్టురాణి అవుతుంది. సీజర్‌కి ఆమె తాను ''నైలు'' నదిలాంటి దాన్నని, 'నది' ఫలప్రద మెలాగో స్త్రీ తన ప్రియునికి బిడ్డల నివ్వడ మలాగని చెబుతుంది. బిడ్డలులేని సీజర్ ఈజిప్టు సాంప్రదాయంగా ఆమెను పెళ్లాడుతాడు. మగబిడ్డ కలుగుతాడు. సీజర్ లేకపోడమేకాదు, అతని ప్రేమ విధానాలు కూడా రోమ్‌లో పరిస్థితులను తారుమారు చేస్తాయి. సీజర్ తిరుగముఖం పడతాడు. 'నియంత'గా ప్రకటించుకుంటాడు. రోమ్‌కి ఈజిప్టురాణి మహా వైభవంగా వస్తుంది. (10 వేల ఎక్‌స్ట్రాలతో, రెండు టన్నుల నల్లని స్ఫిన్క్స్ రథంతో ఈ సన్నివేశం తీశారు) సీజర్ కాబోయే వారసుడు ఆక్టేవియా, సెనెటర్ ఆంటోనీలను రెండు రకాలుగా క్లియో కదిలిస్తుంది. సెనేటర్లంతా 'ఏకైక చక్రవర్తి'గా సీజర్‌ని పట్టాభిషిక్తుని చేస్తామని కుట్రపన్ని అదేరోజున మూక ఉమ్మడిగా హత్య చేసేస్తారు—ఆంటోనీ మాటమీద నమ్మకంలేని క్లియోపాత్రా తిరిగి కొడుకుని తీసుకుని ఈజిప్ట్ వెళ్ళిపోతుంది. సీజర్ హత్య కారకులను వోడించి ఆంటోని సైన్యాధిపతి అవుతాడు. ఆక్టేవియా తప్ప ఆంటోనికి ఆటంకమేలేదు. కాని ఆంటోనీకి సీజర్‌కి చాలా తేడా ఉంది. స్త్రీలోలుడు, పానప్రియునిగా ప్రశస్తి కెక్కిన ఆంటోనీ బ్రూటస్, కాసియస్‌లను వోడించడంకన్నా ఏం చేయలేదు. గోధుమలు, బంగారం తేవాలిఅంటే క్లియోపాత్రా యోగతి కావడంతో రోమ్ వెళ్తాడు. క్లియోపాత్రా కొడుకు పదేనిమిది సంవత్సరాల వాడయ్యాడు. వాణ్ణి ఆంటోనీ రోమన్ సామ్రాజ్యాధిపతి చేస్తాడేమోనని చూస్తున్న క్లియోపాత్రా అతని బలహీనతలనాసరాగా వశపర్చుకుంటుంది. క్లియోపాత్రా వశమైన ఆంటోనీ, ఆక్టేవియా రాజకీయ చతురతవల్ల అతని చెల్లిని పెళ్ళాడుతాడు. రోమ్‌లో ఇంచుమించు స్థానభ్రంశం పొందుతాడు. ఆంటోనీ సీజర్ ఛాయలోనే పెరుగుతాడు—సీజర్ రాజకీయ కాంక్షకన్నా తక్కువ కాంక్ష, క్లియో అంటే ఎక్కువ'పిచ్చి'వున్న ఆంటోనీ ఈజిప్టులోనే ఉండిపోతాడు. రోమ్‌కి, ఈజిప్ట్ సంపదని, ఆ దేశపు 'దేవత' ఐన రాణిని తీసుకు వెళ్ళడానికీవారు యుద్ధాన్ని మాత్రం తీసుకు వెళ్తాడు. ఆక్టేవియా ఆంటోనీలు క్లియోపాత్రా కారణంగా యుద్ధం చేస్తుకుంటారు. రోమన్‌లమధ్య ఈ తగాదా రోమ్ వాసుల శాంతి ప్రియత్వాన్ని నాశనం చేస్తుంది, 'క్లియోపాత్ర' ఆత్మహత్యకి నిర్ణయించుకుంది. కాని ఆంటోనీ ఆమె వెనకాతలే వస్తాడు. అతను పౌరుషాన్ని మరిచిపోయాడనే దుఃఖంలో క్లియోపాత్ర ఈసడిస్తుంది. ''నీకు రాజ్యకాంక్ష, అధికారవాంఛతప్ప ప్రేమలేదు'' అని ఆంటోని నిందిస్తాడు. క్లియోపాత్రా 'తాను ఆంటోనీని ప్రేమిస్తున్నా'నన్న సంగతి అప్పుడు గ్రహిస్తుంది! కాని ఆ ఇద్దరూ తీరని కోర్కెలతో ఒకరి తర్వాత ఒకరు ఆత్మహత్య చేసుకుంటారు. ఆంటోని కత్తిపోటుతో క్లియోపాత్ర పాముకాటుతో, మరణిస్తారు. ఆక్టేవియా అదివరకే సీజర్‌కి క్లియోపాత్రా ద్వారా కలిగిన బిడ్డని చంపేస్తాడు. కాని ఆంటోని క్లియోల ఆఖరి కోర్కె ఇద్దర్నీ ఒకే సమాధిలో పెట్టడం మాత్రం నెరవేరుస్తాడు.

రోమ్ రాష్ట్రంగా ఈజిప్ట్ ఆమె బ్రతికి వుండగా కాలేదు. ముప్పై తొమ్మిదేళ్ల కొంచెం కాలంలోనే క్లియోపాత్రా 'చరిత్ర' చిరస్థాయి అయిపోతుంది.

ఎన్ని రకాలుగా నిర్మాతల జులుబు వదిలిస్తేనేమి, 33 సం. ల ఎలిజబెత్ టేలర్—వాళ్ళ ఋణం ఉంచుకోలేదు—క్లియోపాత్రా తత్వానికే జీవం పోసింది. మెరుపు తీగెలా మారిపోయే భావ వ్యక్తీకరణలతో ఉదాత్తానుదాత్త సన్నివేశాలన్నింటా అద్భుతంగా నటించింది! మొదట్లో 'ఆడ్రీహెప్‌బర్న్' (వార్ అండ్ పీస్) 'సుసాన్ హెవార్డ్' (ఐవాంట్ టు లివ్) లను అనుకున్న నిర్మాతలు—ఎలిజబెత్‌తో యాతన పడుతున్నంత కాలం నాలిక్కరుచుకున్నా ఇప్పుడు మహదానందంగా ఉన్నారు. 'లిజ్' తన సొంత కథతో కూడా పబ్లిసిటీ ఇవ్వగలిగింది. పాత్రకూ జీవం పోసింది. రెక్స్‌హారిసన్ గురించి అందరికీ చిన్న మాపు ఉన్నట్లనుంది. అందరికీ పెద్ద చూపుగల 'సీజర్'గా హారిసన్ బాగా రుజువు చేసుకున్నాడు. సీజర్‌గా అతని పాత్ర నిర్వహణ చాలా బాగుంది. మార్క్ ఆంటోనీ సీజర్ ఛాయల్లో పెరిగిన పాత్ర. అనుకరించడంలోనే ఆంటోనీ సీజర్ దశను అందుకోలేకపోయాడు. ఆఖరికి 'హత్య' కావల్సినవాడు ఆత్మహత్య పాల్పడ్డాడు. ఈ పాత్రపట్ల విపరీతమైన సానుభూతి కలుగుతుంది. అక్కడక్కడ బర్టన్ దురహంకారం చూపించినా, ఆంటోనీగా తన సుదీర్ఘమైన పాత్రని (లిజ్ కనుసన్నలలో మెలిగే బర్టన్) క్లియో కనుసన్నలలో మెలిగే ఆంటోనీగా నిగ్రహంగా పోషించాడు. ''ఆక్టేవియా''గా వేసిన మెక్ డోవాల్ మరుపుకి రాడు. తతిమ్మా విషయాల్లో క్లియోపాత్రా చుట్టూ తిరిగిన ఈ మూడున్నర గంటల చిత్రం 'భారీ' ఎత్తున ప్రేక్షకుల హృదయాలను దోచుకుంటుందని వేరే చెప్పక్కర్లేదు—మద్రాస్‌లో 'భారీ' ఎత్తున (మరో ఈజిప్షియన్ సెట్‌లా ఉందన్నాడో మిత్రుడారోజు) కొత్తగా కట్టిన 70 మి. మి. (పెద్ద తెర) థియేటర్ 'శాఫైర్'లో దీన్ని రిలీజ్ చేశారు. థియేటర్‌లో 'బాల్కనీ'కి లిఫ్టువుంటే బాగుణ్ను. చాలా ఎత్తుగా హుందాగా కట్టారు మరి! థియేటర్, క్లియోపాత్రా రెండు కూడా '64 లో ఈ నగరంలో ప్రత్యేక ఆకర్షణలు కాగలవు.

—వీరాజీ ★



"నాదీ ఆడజన్మే"లో ఒక దృశ్యం.

# సినిమా వార్తలు

## పల్నాటి వీరకథ

"పదకొండు, పన్నెండు శతాబ్దాలలో వాడుకలో ఉండే తెలుగు భాషనే మేము ఈ చిత్రంలో వాడుతున్నాము. సెట్స్‌కూడా ఆకాలంనాటివే! అప్పుడు కోటలు, స్తంభాలు, దర్బారు అలంకరణలు ఎలావుండేవో అలాగే రూపొందించి చిత్రీకరించుచున్నాము. ఈ చరిత్రవిషయక శాస్త్రీయమైన పరిశోధనలు జరిపి అత్యంత జాగరూకతతో శ్రద్ధవహించి చేయుచున్నాము" పల్నాటివీరకథ గురించి చెబుతూ అన్నారు — దర్శకులు శ్రీ జి. రామినీడు.!

నాగమ్మ దర్బారు, పెరిందేవి దర్బారు, నాగమ్మ పూజామందిరం, బ్రహ్మనాయుడు భవంతికి సెటుపత ఇంతవరకు పనులు జరిగాయి. డిశంబరు 15 నుంచి మాంచాల దర్బారులో షూటింగ్ జరుపుతారు. ఇందులో మాంచాల— బాలచంద్రుని నొసట వీరతిలకం దిద్ది యుద్ధానికి పంపే సన్నివేశం, మొదలైనవి చిత్రీకరించుతారు.

రికార్డుచేసిన మూడు పాటలు చిత్రీకరించారు. మొదటిది, సుశీల, జానకి పాడినది. షెబ్బాయ్ అనే వేశ్య (ఎల్. విజయలక్ష్మి) వలలోపడిన బాలచంద్రుడు, భార్యావియోగంతో పరితపించుచూతున్న అలరాజును— ఊరిన్నూ, ఇద్దరమ్మాయిలు జమున, వాసంతిల మైనా. రెండవది పి.బి. శ్రీనివాస్, జానకి పాడినది, శోభనపురాత్రి అలరాజు, పెరిందేవిలమైనా. మూడవది: భానుమతి పాడినది; అమ్మైనా చిత్రీకరణ జరి పారు. మాంచాల దర్బారులో రెండుపాటలూ, రెండు పద్యాలూ ఉంటవి,.

ఈ చిత్రంలో బ్రహ్మనాయుడుగా ఎన్.టి. రామారావు, అలరాజుగా కాంతారావు, నలగామరాజుగా గుమ్మడి, బాలచంద్రుడుగా హరనాథ్, నాయకురాలు నాగమ్మగా భానుమతి, మాంచాలగా జమున, పెరిందేవిగా వాసంతి, వేశ్య షెబ్బాయ్‌గా ఎల్. విజయలక్ష్మి నటించుచున్నారు. అతి వ్యయప్రయాసలకోర్చి నిర్మించుతున్న ఈ "పల్నాటి వీరకథ"లో శిల్పానికి చాలా ప్రాముఖ్యం ఉన్నది. ఆభాద్యత కళాదర్శకులు గోఖలే చేపట్టారు. సంగీతం: యస్. రాజేశ్వరరావు, కెమెరా, పి. నాగేశ్వరరావు, దర్శకుడు: జి. రామినీడు, నిర్మాతలు: టి. హనుమంతరావు, డి. సూర్యనారాయణ, వై. లక్ష్మయ్యచౌదరి, స్క్రీన్ ప్లే, సంభాషణలు సదాశివబ్రహ్మం వ్రాశారు. మాంచాలకు సుశీల, పెరిందేవికి జానకిచేత పాడించుచున్నారు. గీతాలరచన చేసినది: మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల (సీనియర్), ఆరుద్ర. మే 65 నాటికి విడుదల చేయాలని అనుకుంటున్నారు.

## పాండవ వనవాసం

మాధవీ ప్రొడక్షన్స్‌వారు భారీ సెట్స్‌తో, అగ్రశ్రేణితారలతో, అధికవ్యయంతో నిర్మించుతున్న "పాండవ వనవాసం" చిత్రం— మెజస్టిక్ స్టూడియోలో త్వరితగతిన సాగుతున్నది. ఎన్. టి. రామారావు, కాంతారావు, నాగయ్య, హరనాథ్, యస్. వి. రంగారావు, పద్మనాభం, నాగయ్య, ముక్కామల, ప్రభాకరరెడ్డి, రాజబాబు, పద్మనాభం, సత్యనారాయణ, సావిత్రి, ఎల్. విజయలక్ష్మి, రాజసులోచన, సరస్వతి (పద్మ), కుమారి మాలతి, వాణిశ్రీ, సంధ్య, ఋష్యేంద్రమణి నటించుతున్నారు. రచన: సముద్రాల (సీనియర్), సంగీతం: ఘంటసాల, నృత్యాలు: వెంపటి, కళ: కృష్ణారావు, కెమెరా: పి. నాగేశ్వరరావు, దర్శకత్వం: కె. కామేశ్వరరావు బి. ఏ., నిర్మాత: ఏ. ఎస్. ఆర్. ఆంజనేయులు. జనవరి మొదటి వారంలో విడుదల అవుతుంది.

## సంగీత దర్శకుడు వేణు

మెట్లెక్కి మేడ ఉపరిభాగానికి వెళ్లేసరికి సంగీత ధ్వనులు సన్నగా వినిపిస్తున్నవి. మ్యూజిక్ రూమ్! చక్కటి అక్షరాలతో అందంగా అలంకరించబడి ఉంది. గదికి ఎదురుగా లక్ష్మి, గణపతి, సరస్వతిల వెండి విగ్రహాలు, ఆ ప్రక్కగా పియానో .... సంగీత దర్శకులు వేణు దానిముందు కూచుని వాయించుచున్నారు. మధురమోహనమైన ఆలాపన! అక్కణ్ణుంచి కదలాలని, ఆయనను కదపాలని— అనిపించలేదు.

ప్రస్తుతం వేణు పద్మశ్రీ పిక్చర్స్‌వారి "ప్రేమించి చూడు" చిత్రానికి సంగీత దర్శకత్వం వహిస్తున్నారు. ఆ చిత్రం తాలూకు ట్యూన్ కాపోలు చేస్తున్నారు. కొంతసేపయిన పిదప వెనుకకు తిరిగి "హలో! ఎంతసేపయింది వచ్చి? అక్కడే నిలబడిపోయారేమిటి? లోపలికి రండి" అంటూ ఆహ్వానించారు. లోపలికి వెళ్లేసరికి— సంగీతంలో ఆయనకు గల ప్రతిభను గుర్తింపజేస్తున్న బహుమతులు కనిపించినవి. చిత్రనిర్మాతలు, పంపిణీదార్లు, ప్రదర్శకులు ఇచ్చినవి.

ప్రజ్ఞగల సంగీత దర్శకుడు వేణు. సంగీతంలో కొత్త బాణీలు సృష్టించాలని, ప్రేక్షక హృదయాలను రంజింపజేయాలని అహోరాత్రాలు కృషి చేస్తూనే ఉంటారు ఆయన. ఏమాత్రం తీరిక దొరికినా సంగీత సాధనలో నిమగ్నులవుతారు. అందులో తను ఎంత సాధించినా, సాధించవలసినది ఇంకా ఎంతో ఉన్నదని అంటారు వేణు. 'ఫలానా చిత్రంలో ఈ వరుస ఎంత చక్కగా చేశారు!' అని ఎవరైనా అంటే — 'అందులో ఏముంది లెండి!' అనేస్తారు తేలికగా. పాండిత్యం ఉన్నా చాటుకోని మనిషి. చాలా అరుదుగా కనిపిస్తారు ఇలాంటివారు.

## ప్రజ్ఞగల నటి జానకి

జానకి బహుముఖ ప్రజ్ఞాశాలిని అయిన నటి. అనుద్ధరించే పాత్ర ఎలాంటిదయినా— దానికి మెరుగులుదిద్ది పోషించి, మెప్పించగల సమర్థత ఆమెకు ఉన్నది. జానకి నటించిన "మొలగువతి" అనే ఒక తమిళ నాటకం ఈమధ్య మద్రాసులో జరిగింది. అందులో ఆమె ఆదర్శమూర్తిగా, త్యాగమయిగా అపూర్వమయిన నటన కనపరచింది. ఆ వేషంలో జీవించింది. ప్రక్క పాత్రలకు జీవం పోసినది. నాటకం రక్తికట్టించినది.

# సినిమావార్తలు

జానకి లేకుంటే మోహితకత్తిలో వెలుగు ఉండదని పిస్తుంది, మనోహరంయితే రససిద్ధిని చేకూర్చలేరని పిస్తుంది. ఇటీవల వచ్చిన "పుదియ పర్వై" తమిళ చిత్రంలో ముఖ్యభూమికను ధరించింది జానకి. అలాంటిపాత్ర ఆమె పోషించటం అదే మొదటిసారి అయి ఉండవచ్చు. అయినా నేర్పుగా నిర్వహించి—చిత్రం మొత్తంమీద తనపాత్రకు అందం తీసుకు వచ్చింది.

ఇలాంటి ప్రజ్ఞగలనటిని తెలుగువారు, తమ చిత్రాలలో ఎందుకు వినియోగించుకోవడంలేదు ? అన్న ప్రశ్న మొదటినుంచీ మిగిలిపోతున్నది.

## ప్రేమించి పెళ్ళిచేసుకో

గోకుల్ ఆర్ట్‌థియేటర్స్‌వారి "ప్రేమించి పెళ్ళి చేసుకో!" చిత్రం ఫిలింసెంటరులో నిర్మించబడుతున్నది. ఎన్. టి. రామారావు, కృష్ణకుమారి, ముఖ్యపాత్రలు పోషిస్తున్న ఈచిత్రానికి బి. యస్. నారాయణ దర్శకత్వం వహిస్తున్నారు. నిర్మాత: దొనేపూడి కృష్ణమూర్తి.

## మంగమ్మ శపథం

"విజయ్ !" మంగమ్మ అరచింది. కొరడాతో రాజును కొట్టేందుకు సిద్ధమవుతున్న కొడుకును చూసి, కలవరపడుతూ వడివడిగా వచ్చింది.

"అమ్మా !"అన్నాడు ఆశ్చర్యంగా విజయ్.

విజయ్ చేతిలోని కొరడానులాక్కుని దూరంగా విసరి వేసినది మంగమ్మ. "విజయా ! నువ్వెంత గారాల బిడ్డవైనా నాకళ్ళముందే నాభర్తను హింసించడం.......నేను సహించలేను !"భర్తపైగల ఆమె రాగమూ, అభిమానమూ ప్రకటిస్తూ అన్నది.

రాజుకు విషయంసరిగా బోధపడలేదు.



"మంగమ్మ శపథం"లో
ఎన్. టి. రామారావు, రాజశ్రీ.

"మంగమ్మా, ఎవడు వీడు ?" అన్నాడు.

"మన కుమారుడే మహారాజా !".

"మన కుమారుడా?" రాజులో ఆశ్చర్యం మొలకెత్తింది. నమ్మరాని సంగతిగా తోస్తున్నది. "అసంభవం ! నువ్వు కూడా నన్ను మోసగించాలని చూస్తున్నావా ?"

మంగమ్మ పలుకుండలా నిండుగా ఉంది. జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలను తట్టుకున్న యీ ప్రశ్నకు భయపడలేదు. కాని, మొహంలో వేదన స్పుటంగా కనిపిస మెల్లగా యిలా అన్నది : "ఈనాడు వ కాదు మహారాజా ! న్యాయంగా నాదైన అ మాటగా అందుకోలేక, అన్నమాట చెల్లించు లన్న ఆవేశంతో—కొన్నాళ్ళ మిమ్మల్ని మోసమే చేశాను. అందు అనుక్షణం, ఈరోజు వరకూ బాధపడుతూనే ఉన్నాను. ఇరవైఏళ్ళనాడు అం పుర ఉద్యానవనంలో నాట్యంచేసిన ఒక దొమ్మ సానికి .... మీ జీవితంలో కొన్ని మధుర క్షణాల పాలుపంచారు. జ్ఞాపకముందా ? .... ఆనా మీ ప్రేమ పారవశ్యంలో ప్రసాదించిన వర యీ విజయుడు."

ఆమె మాటలు రాజులో ఏర్పడ్డ అవిశ్వాస దూరం చేయలేకపోతున్నవి "పాతాళ చెరసాల బందీవైన నీవు, దొమ్మరిసానివై మమ్ము స పించడం అసాధ్యం !"

"ఈనాడు ఇక్కడి కెలా రాగలిగావో—అప్ప అలాగే వచ్చాను. పాతాళ చెరసాల మా ఇంటికి నిర్మించిన రహస్యమార్గం ధించండి. ఒకనాడు మీరు విన్న మగొంతు ఈ చిట్టితండ్రిదే !"

మంగమ్మ ఇంకా తనను మోసగించ జూస దనే రాజు అభిప్రాయం. ఆ ధీమాతోనే "నే విశ్వసించం" అన్నాడు.

"విశ్వసించరని నాకు తెలుసు." రాజు సంతా చదివిన ఆమెకు, అతని స్వభావం అను మైనదే ! అందుకే "కనీసం వీటినైనా గుర్తి స్తారా ?" అన్నది.

—కరుణరసం చిప్పిల్లే యీ సన్నివేశం డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి "మంగమ్మశపథం" చిత్రంలోనిది. రాజు, విజయ్‌లుగా ఎన్. టి. రామారావు, ద్విపాత్రాభినయం చేస్తున్నారు. మంగమ్మ పాత్ర ధారిణి జమున. దర్శకత్వం : విఠలాచార్య, నిర్మాత : డి. వి. ఎస్. రాజు.

## రాజద్రోహి

పి.యస్.ఆర్. పిక్చర్స్‌వారి "రాజద్రోహి" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉన్నది. సావిత్రి, ఎస్. వరలక్ష్మి, శివాజీ గణేశన్, వి.కె. రామస్వామి మున్నగువారు నటించిన ఈ చిత్రానికి మాటలు : మహారథి, పాటలు : వేటూరి, సంగీతం : కె.వి. మహాదేవన్, దర్శకత్వం : ఎ.పి. నాగరాజన్, నిర్మాత : పింజల సుబ్బారావు.

## విజయలక్ష్మి పిక్చర్స్

విజయలక్ష్మి పిక్చర్స్‌వారి జానపద చిత్రం విఠలాచార్య దర్శకత్వంలో షూటింగు చకచకా సాగుతున్నది. రాజశ్రీ , యస్.వరలక్ష్మి, గీతాంజలి, వాణిశ్రీ , కాంతారావు, రాజనాల, బాలకృష్ణ, లంకసత్యం, మొదలగువారు నటిస్తున్నారు. సంభాషణలు : మహారథి, పాటలు : సి. నారాయణరెడ్డి , జి.కె. మూర్తి, సంగీతం : రాజన్—నాగేంద్ర, నృత్యాలు : చిన్ని—సంపత్, కళ : బి.సి. బాబు, కో డైరెక్టర్ : ఎస్. జి. లాల్, కెమెరా : వెంకటరత్నం నిర్వహిస్తున్నారు.

—మోహన్ కుమార్ ★



మధుపిక్చర్సు "ప్రొడక్షన్ నెం. 2" లో కృష్ణకుమారి.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



"స్వామి భక్తి"  ఫొటో : ఆర్. సుబ్రహ్మణ్యం

